శ్రీమన్మహాకవి కాళిదాసీయ

# శ్రీ దేవీపంచస్తవి

( శ్రీ మాతృకాస్తవ పంచకము )

ఆంధ్రానువక్త:

శ్రీ శ్రియానందనాథాపరనాముఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ

శ్రీకాకుళం. : : (శ్రీకాకుళంజిల్లా)



పరిశీలకులు :

బ్రహ్మశ్రీయుతులు: డా॥ ఎస్. వీరయ్యదేవరగారు

( దీక్షానామము — శ్రీ శివానందస్వామి )

శ్రీ శివానందాశ్రమము – రాయవరము,

రాయచోటి తా॥ (కడపజిల్లా)

వెలువడనున్న. శ్రీ శర్మగారి గ్రంథములు :—

1. శ్రీసూక్తరహస్యార్థము.
2. పుత్రవతీ హితోపదేశ గీతములు.
3. శిశువ్యాధులు.
4. నందనార్ - గానబంధు - సతీసులోచన - యక్ష
5. మహాసార మంత్రానువాదము.

వెలువడనున్న, శ్రీ శర్మగారి గ్రంధములు :—

1. శ్రీసూక్తరహస్యార్థము.

2. పుత్రవతీ హితోపదేశ గీతములు.

3. శిశువ్యాధులు.

4. నందనార్ - గానబంధు - సతీసులోచన - యక్ష[illegible]ము

5. మహాసౌర మంత్రానువాదము.

శ్రీ మన్మహాకవి కాళిదాసీయ

# శ్రీదేవీపంచస్తవి

(శ్రీ మాతృకాస్తవ పంచకము)

---

ఆంధ్రానువక్త.

శ్రీ శ్రియానందనాథపరనాముఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ

శ్రీకాకుళం. : : (శ్రీకాకుళంజిల్లా)



కృతిపతి :

శ్రీ శ్రీవిద్యానందనాథపరనాములు

బ్రహ్మశ్రీయుతులు: లక్ష్మీదత్తద్వివేదిగారు

గుజరాతిపేట, శ్రీకాకుళం.



ప్రకాశకులు :

శ్రీ శివానందస్వామీతి దీక్షానామధారులు

బ్రహ్మశ్రీయుతులు: డా॥ ఎస్. వీరయ్యదేవరగారు

రాయవరం - రాయచోటి తా॥ (కడపజిల్లా)

# శ్రీ శివానందమహిమము

—: • :—

కం॥ శ్రీరజతాచలపతిపద
నీరజమధుపాయమాననిర్మలమతి! శ్రీ
వీరయదేవర! యిది కై
వారమ్మనఁబోకు, వాస్తవము స్తవమగునే?

మ॥ ఇదె సౌజన్య, మిదే యుదారగుణ, మిద్దే స్వార్థరాహిత్య, మి
య్యదె నిష్కామిత, యియ్యదే పరశివధ్యానాత్తసాద్గుణ్య సం
పద యంచున్ బుధులెన్న, నాదు కృతి నవ్యాజంబుగా నచ్చునన్
బొదలన్జేసితి వెట్టి లంకె మనకున్మున్నొప్పెనో? మిత్రమా!

మ॥ తొలి జన్మంబున మైత్రి యెట్టిదొ? సతీర్థుల్గాఁగ మన్నారమో?
తలపంగా మన యన్వయంబొకటొ? సిద్ధంబైన శైవాజ్ఞయో?
తెలియన్రాని కతంబెదో మనల సంధించెన్; యథార్థంబుగాఁ
గలదే పాఁతటికంబొకింత మనకిక్కాయంబుతో నెట్టులేన్.

గీ॥ కడపమండల మేడ? శ్రీకాకుళంబ
దేడ? అర్వది యోజనాలేని దవ్వు;
సబబు యోజింప మన వ్యతిషంగమునకు
దైవమే కాని మానుషమై వఱలునె?

చ॥ యతపతివై తపోబలసమార్జితశైవమహస్సు వెల్గు పు
ణ్యతముఁడ వీవు; శక్తిచరణామృతపానసమాత్తశర్మసం
భృతమతి నేను, గాన నొక వింతయె యీవ్యతిషంగ మెన్నఁగా;
సతము శివామృతాంబుధినె శక్తిసుధాపగ చేరఁజూచుఁగా.

గీ॥ "ఆర్య! పంపుఁడు మీదు సౌందర్యలహరి"
యన్న యెందటి జాబులో యందుకొంటి;
ఐనఁదమ్ము కమ్మతలఁబ్రణవాక్షరమునఁ
దోఁచు తేజు మఱెందునఁదోఁచకుంట.

శా॥ శ్రీచక్రార్చనదక్షుఁడో? పరశివశ్రీపాదపంకేజసే
వాచాతుర్యధురంధరుండొ? సుతపోభ్రాజిష్ణుఁడో? కానిచో
నాచిత్తమ్ముఁగరంచు తేజ మొక పేనాకోనలోఁబుట్టునే?
ఈచిత్రమ్మెట్టు పండునో? శివుని తేజే శక్తి వైపయ్యెఁగా;

గీ॥ అనుకొనుచు నాదు కృతి యెడ ననిన మీదు
మాటకుఁగృతజ్ఞతంజూపి, మఱియుఁగొన్ని
కృతులఁబేర్కొని యివి యముద్రితములంటి;
సత్తములఁ బ్రకటించుచో నిత్తునంటి.

ఉ॥ కీరితి, పున్నెమున్, గగనకేశుని సత్కృప యబ్బు దారులే
యారసికొంచు, నాతరుణ మబ్బినఁగోల్పడ రాదటన్న ధీ
సారుల సూక్తి నీహృదయసద్మమునం దెపుడాదుకొంటివో
వీరయ దేవరా! కడు వివేకివి, చక్కనియెత్తుకాఁడవే.

గీ॥ తడవు లేకయె "శ్రీకాళిదాసకృతము
దేవి పంచస్తవి నిఁక ముద్రితము చేయు
బరువు నాపైని బెట్టి ద్రవ్యంబ దెంత
యగునొ తెల్పుఁడు వేగ; "శివాజ్ఞ" యనవె?

ఉ॥ వీరుఁడ వీవు దానమున; వీరుఁడ వీశతపఃక్రియారతిన్;
వీరుఁడవన్యకార్యహితనిష్ఠను; గావున వీరయాఖ్య నీ
కారయ సార్థకంబనుచు, నాప్తుల మిత్రుల బంధులన్‌గురున్
జేరిచి నీయుదారగుణశీలము వించితి నించితిందమిన్.

కం॥ సారెకు నీసంఘటనపు
సారము యోజించి బుద్ధిసారము మెఱయున్
వీరయ దేవర! మనలన్
గూరిచి వారనిన మంచినుడులన్వినుమా.

సీ॥ "మాహేశభక్తులౌ మగటపల్లి నృసింహ
మూర్తి సోదరు లొక పుస్తకంబు,
నీ శిష్యులున్ శీలనిధులైన సరిపల్లి
సన్యాసిముఖు లొక సత్కృతియును,

సూర్యభక్తుండు తేజోమూర్తులకులజ
రామశాస్త్రి మఱొక్క గ్రంథమణిని,
విష్ణుభక్తుఁడు వెజ్జు బెజవాడ వేంకట
స్వామినాయండొక వైద్యకకృతి,

నిట్లు భక్తులు తామె నీకృతులనెల్ల.
బ్రకటన మొనర్చుటది యలవాటు గాఁగ
నీవు "పంచస్తవికి" నొక్క నిర్మలాత్మ
నేల చూపదు శ్రీమాత? ఈ "స" శర్మ!

సీ॥ ఓంకారమే వ్రాసె; ఓంకారమే పల్కె;
ఓంకారమే వ్రాత నున్నదియును,
ఓంకారమందె నీకుత్సాహ మొప్పారె!
ఓంకారమే మీకు నొంటు కూర్చె!
ఓంకారమే శివుం డోంకారమే శక్తి;
ఓంకారమే సర్వ: మున్నదదియె!
ఓంకారచిత్రిమ్ము నూహింపఁదరమె? ఓం
కారమే కారణకారణమ్ము!

ఇట్టియోంకారరతులు మీయిర్వురకును
నైన వ్యతిషంగ మది యెక్క యబ్బురంబె?
ఈవిధంబగ వీరయ దేవరకును
నీకు నీనాఁటి నేస్తమా నిక్కమెన్న?

గీ॥ తలఁపగ నిమిత్తమయ్యె సౌందర్యలహరి
యుభయమైత్రికి: శివుఁడును నుమయు దయను
దొంటి ప్రతిబంధ మిప్పుడు తొలఁచి,రంతె
కాని యా శివదృష్టికిఁగలదె చాటు?

చ॥ పరశివదృష్టియందు నిజభక్తుఁడు వీరయదేవరాఖ్యుఁడే
పరలఁగ నీకృతింబయలుపర్చెడి భాగ్యము లాఁతికబ్బునే?
పరలరె నీ సతీర్థులొకవంద? ధనాఢ్యులు లేరె? నీవె త
త్కరములఁబెట్టినన్ ఫలము దక్కనె? యీ సుకృతంబలంతియే?

చ॥ ప్రతిఫలకాంక్షలేక, కవివ్రాసిన సత్కృతి వెల్లడించి, భ
క్తతతికి నందఁజేయు వరదాతదె కీరితి: వాని యాత్మకే
తతసుఖశాంతు: లాగిరిశధామము వానికె స్వాగతంబిడున్;
వితతతపోనిధీ, యనఘ: వీరయదేవర: యంచుఁ దెల్పుమా:

కం॥ నిరపేక్షన్ గృతి భక్తుల
కరముల కందిచ్చు నీకుఁ గల్యాణదుఁడౌ
పరమేశుఁడు దీర్ఘాయు
ష్కరుఁడౌత మటంచు నాశిషములిడిరి చుమా.

చ॥ గురుచరణార్పితంబుఁ గృతిఁ గూర్చి సతీర్థుల, వెల్లడింపఁగా
గురుతరయత్నముంజలిపి కోరిక వ్యర్థము గాఁగ, నిందెదో
యురుతరహేతువుండునని యుండఁగ, వీరయదేవరాఖ్యు నిన్
బరమశివుండు చూపెఁగదె;వాని తలంపె జయంబు నందెడున్.

శా॥ నాచేతన్ భవదీయసత్కృతులె పన్నంజేయుమా: తత్కృతుల్
నీచాలంబము నొందకుండఁగనుమా: నీ భక్తులంజూపుమా
ప్రాచుర్యమ్మనకంచుఁజేయు మనవుల్ వ్యర్థంబు కాకుండ ని
న్నే చూపెట్టెను వీరశైవుని జగన్నిర్మాతృ సత్ప్రేమతోన్.

సీ॥ ఆశీర్వదింతునా యైశ్వర్యలబ్ధికై?
నగుబాటు లవి శివానందులకును;
కృతమెంచి పల్కనా?కృతకృత్యులగు శివా
ద్వైతులకవి ముఖస్తవము లగును;
ఉద్బోధ సేయనా?ఒరుల బోధ కపేక్ష
పడని జ్ఞానుల కవి వెడ పలుకులు;
పేర్కొందునా?ఒక కోర్కి లేనట్టి ని
రాడంబరుల కవి యాటలగును;

ఏమిచేయుదు?నిన్నాయుమామహేశ
భక్త శుభదృష్టికిన్, శివశక్తిపాద
సారసములకు,నాఁటి యోంకారకాంతి
కనఘ! వీరయ దేవరా! అప్పగింతు,

కం॥ అమ్మా! నాధ్యానావస
రమ్మున వీరయ్యదేవరను జూపుము ని
త్యమ్మనుచుఁజిన్నిపుపులన్
జిమ్మెద ముమ్మాటికి "శివ,శివ,శివ,యనుచున్.

గీ॥ నాదు కృతి నీయుదారగుణమ్ము చేతఁ
బరికటితంబను తన్వి చెప్పంగ రాని
దైన నొక వీరశైవ మహానుభావ
మైత్రి లాభంపుఁదన్వి శ్రీమాత యెఱుఁగు.

సీ॥ శివశక్తివీర్యసంజ్ఞితరసగంధక
కజ్జలిన్ జ్ఞానరుక్మమును గూర్చి,
శ్రద్ధాఖ్యకార్పాసరసమున, దృఢభక్తి
తప్తఖల్వవిమర్దితముగఁజేసి
విమలహృత్కాచకూపిక నుంచి, నిర్జన
నిర్వాతయోగ్యమందిరమునందు,
అచలదేహాఖ్యభాండాంతరస్థముఁజేసి
ధ్యానయోగాగ్ని సంధానపఱచి

పాకగతులెంచి, కుప్పె పైభాగమందు
ద్యుతుల నీనెడి పూర్ణచంద్రోదయమును
వందుకొని తింద, మిత్తము వ్యాధితులకు,
నుభయులము నేర్పు గల్గు వైద్యులము గాన.

గీ॥ మన తనువులను దౌల నుంచినను మనసు
లొకటి చేసిన పూజ్యశైవోత్తమకళ
మనకు మేతగులూడ్చిన మంచిమాటె;
ఉంచెనా. ఉంచుఁగాక యీ యుద్ది మనకు.

ఇతి శివమ్.

శ్రీకాళిదాస పంచస్తవీగ్రంథానువక్త.
శ్రీశ్రియానందనాథాపరనాముఁడు. ఈశ్వర సత్యనారాయణశర్మ
శ్రీ కా కు ళ ము

శ్రీమాత్రే నమః

పంచాశల్లిపిపద్మస్థ పంచలింగప్రసాదతః
పంచప్రణవరూపిణ్యాః పరశక్త్యాః ప్రసాదతః
పంచపంచాస్యలింగోత్థ పంచాచార్యప్రసాదతః
పంచధార్ఘణసంతుష్ట దేశికాశీః ప్రభావతః
పంచాక్షపటుతాయుక్తః పంచాశద్ద్వయహాయనః
పంచజ్ఞానః శివానందస్వామీ జీయాన్నిరామయః

# డాక్టర్ శ్రీ శివానందము వీరయ్యదేవరగారి చరిత్ర సంగ్రహము

---

పాఠక మహాశయులు !

నేఁటిదాఁ నొండొరుల ముక్కు మొగమెఱుంగక నా సౌందర్యలహర్యను వాదమునుశ్రీవారందుకొనుదాఁక కమ్మలమూలముగానైనఁబరిచయము లేక యాంధ్రావని యట్టించుననే మూలనో మూల్గుచున్న నా యీ కృతిని నిరపేక్షముగా నచ్చొత్తించి భక్తకరములఁబెట్టుచున్న వీరశైవశిఖామణి శ్రీ వీరయ్యదేవరగారి జీవిత సంగ్రహ చరిత్ర మిటఁబెట్టుట యప్రస్తుతము కాదు. శ్రీవారికిది యిష్టము కాకున్నను నా విధియని ప్రయత్నపూర్వకముగా సంగ్రహించినదానిలో సంగ్రహమిది.

శ్రీవారిది కడపజిల్లా, రాయచోటి తాలూకా రాయవర గ్రామము నివాసస్థలము. లింగి బ్రాహ్మణులు. (జంగములు) మతము వీరశైవము. "అహమి ప్రలయం కుర్వన్నిదమః ప్రతియోగినః పరాక్రమపరో భుంక్తే స్వాత్మాన మశివాపహమ్" అని పరాపఞ్చాశికయందు నిర్వచింపఁబడిన లక్షణములు పూర్ణముగా నన్వయించు వీరుఁడు. (సాధకేంద్రుఁడు)

ఇంటిపేరు శివానందమువారు. వీరి పూర్వులు సమ్మెటయను గ్రామము నుండి రాయవరముచేరుటచే సమ్మెటవారని వ్యవహారము. శ్రీజనమే జయ మహారాజ ప్రతిష్ఠితమును బాహుదా పింఛా నదీ సంగమదేశస్థమైన సంగమేశ్వరాలయసమీపమున జంగమపల్లె యిప్పటి కాపురపుటూరు.

స్కందసగోత్రులు. విశ్వకర్ణశాఖీయులు. తండ్రి-శివశ్రీ గంగ
గారు. సత్యసంధులు. కరలింగార్చననిరతులై యుపనిషద్గీతా పఠనాదినిష్ఠ
75 సంవత్సరములు పవిత్ర జీవయాత్రచేసి శివైక్యము నొందిరి. తల్లి
కుం॥ సీ॥ సిద్దమాంబ. శ్రీ దేవ్యుపాసనాతత్పర. సువ్రత దానశీల. పిను
నాథవ్రత. జనులచే భూగత భూధరసుతగాఁబూజింపఁబడినది. ఓ
యేకాదశీ పుణ్యదివసమున ధర్మ్యచరణసన్నిధిని సుత బంధుమిత్రాశ్రితస
క్షమున "నేను నేఁడు శ్రీ దేవిసన్నిధి కేగుచున్నా"నని చెప్పి యైక్యమొంది
తపఃశాలిని.

ఈ పుణ్యదంపతులకుఁ గలిగిన పుత్ర పంచకమున మన పంచస్త
ప్రకాశకులైన వీరే జ్యేష్ఠులు. తక్కు నలువురు సత్పురుషులు. సంతా
వంతులు. సుఖులు.

శ్రీ దేవరగారి గురుమండలి:—

1. బ్రహ్మశ్రీ ఉక్కలి సుబ్బశర్మగారు. ఆంధ్రగీర్వాణ గురువులు

2. పంచపీఠోద్ధారక, భీష్మ బ్రహ్మచారీత్యాది బిరుదాంకితులు
సప్తత్యధిక గ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ కాశీనాథ శాస్త్రిలవారు కన్న
భాషా గురువులు. (వీరు వ్రాసిన వానిలో శ్రీ జగద్గురు పంచాచార్యప్రా
నత" 2 "వీరశైవరత్న" అను గ్రంథములను నేను జదివితిని. అందలి
కన్నడ భాషామార్దవము, ఉపన్యాస శుద్ధి మధురిమ, అటుండ శ్రీ శాస్త్రి
వారి బహు శాస్త్రపారంగతత్వము, సర్వమతసమాదరము, లోకజ్ఞాన సంప
దయుఁ జదువరులను స్తబ్ధులను జేయును. వీరశైవమతోద్ధరణమునకై
యవతరించిన యపర శంకరులనుగానెంచి నమస్కరించితిని.)

3. శ్రీ శంకర మఠస్థాపకులు శ్రీ ముసలయ్యగారు వీరి వైద్యక
గురువులు.

4. శ్రీ జగద్గురు, పండితారాధ్య, వీరసూర్య సింహాసనచరపట్టాధి
కారులు. అపర మార్కండేయ బిరుద భూషితులగు శ్రీశ్రీశ్రీ వీర గురు
స్వాములు వీరి శైవదీక్షోపనేతలు.

5. జగద్విఖ్యాత పురుషులు, ఏర్పేడు వ్యాసాశ్రమ నిర్మాతలు
శతాధిక వేదాంత ధర్మ నీతి భక్తి గ్రంథకర్తలు మహర్షితుల్యులు యథా

భారతీ పత్రికా సంపాదకులునగు శ్రీశ్రీశ్రీ మలయాలయస్వాములవారు వీరి వేదాంత విచారదేశికులు.

6. విభూతి పత్రికా సంపాదకులు, విద్వద్వరేణ్యులునైన బ్రహ్మశ్రీ వీరభద్రశర్మగారు వీరి వీరశైవజ్ఞానమార్గదర్శకులు.

7. శ్రీ 1008 జగద్గురు విశ్వారాధ్యజ్ఞాన సింహాసనాధీశ్వర శ్రీశ్రీశ్రీ వీరభద్ర శివాచార్యమహాస్వాములు, వేదతీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధీత్యాది బహు బిరుదభూషణులు, సర్వతంత్ర స్వతంత్రులు, సర్వమతసమాదరులు, తపోధనులు, శివపంచస్తవి, రేణుకవిజయ, విభూతీద్యాది బహు గ్రంథకర్తలు, శ్రీ కాశియందు జ్ఞానమందిర బృహద్గ్రంథాలయ ప్రతిష్ఠాపకులునైన జగదారాధ్యులవలన మన గ్రంథ పరికాళకులు స్ఫాటిక లింగ సాలగ్రామ శ్రీ చక్రార్చన షట్చక్రోపాసనా ప్రణవధ్యానాదికముల నుపదేశ మొందిరి.

ఈ శ్రీ గురుస్వాముల యానచేతనే మన వీరయ్యదేవరగారు అసమ తపోదీక్ష నెఱపిరి. శ్రీ శివానందాశ్రమమను పేర నొక సార్థకాశ్రమము నిర్మించుకొని యందు 13 సం॥రములు స్ఫాటికలింగ శ్రీచక్రార్చనముల తోను వేదాగమోపనిషచ్చర్చలతోను గీతావతనాదులతోను సాంగి యిపుడవి యన్నియు శ్రీశైల పీఠమందు సమర్పించి నిరాడంబరముగా నిరాలంబో పాసనయందే నిష్ఠితులై ధర్మ చికిత్సచేయుచు పవిత్ర జీవయాత్ర చేయుచున్నారు.

ఋషి సప్తకమువంటి గురుసప్తకమునకు శశ్రూషా సేవలుచేసి గడించిన వీరి జ్ఞానమును గొలువనలవియా? వీరి శైవ వైధ దీక్షానామము. "శ్రీశివానందస్వామి" శివభక్తికిందోడు కేశవభక్తి వీరియందుచిత్రవిశిష్టము.

ఏమన వీరి యిలవేలుపు శివునకుందోడు శ్రీవెంకటేశ్వరులట. చదు పరులకు గొందఱకును వీరశైవులగు కొందఱకును వింతగానే యిది తోచును. గాని నాకుగాదు. మన శ్రీ శివానందస్వాములు వెంకటేశ్వరుల పేర శ్రీ బాలా త్రిపురసుందరిని ఆ శివశక్తినే యారాధించు చున్నారు. ఏమన మన దేశమందే తిరుమలనాథుని వెంకటేశ్వరుడందురు. కాని తక్కు వంగ మహారాష్ట్ర హిందుస్థానాదుల వారెల్లరు "బాలాజీ" యందురు. కొన్నిపందల యేండ్లు సుప్రసిద్ధముగా జనులనోట నలిగిన యా మూర్తి

పేరదియే. కావుననే నేఁటికిని బహుజనముఖమున బ్రోగుచున్నది. తిరుమల క్షేత్రము ఇటీవల విశిష్టాద్వైతమత స్థాపకులగు శ్రీరామానుజస్వాములచే విష్ణుక్షేత్రముగా సంస్కరింపఁబడిన కేవలశివలింగక్షేత్రమైన శ్రీకూర్మము మున్నగువాని వంటిదయై యచ్చట శివక్షేత్ర చిహ్నములవలెనే యిచ్చట నేటికిని శివశక్తి క్షేత్రచిహ్నములు పోకున్నది. శ్రీ వెంకటేశ్వరమూర్తి బాలాత్రిపురసుందరీ చతుర్దశ భేదములలో నొకధ్యానమూర్తియే యని తద్జ్ఞులెఱుంగుదురు. నేఁటికిని శుక్రవారమునాఁడు కుంకుమార్చనము, పూల మహాసేవ, ఉత్సవమూర్తులను పులివాహనముపైని దిరువీధి, ధనుర్మాసమున బిల్వదళార్చనము, ఆశ్వయుజమున బ్రహ్మోత్సవము మున్నగున వెన్నియో సాఁగుచున్నవి సాక్ష్యములు కావా? కంఠమున నాగాభరణమున్నదనియు ప్రక్కనేక ముఖశూలమున్నదనియు పాదములయొద్ద సర్ప మున్నదనియు, స్వర్ణమయ శంఖచక్రములు మూలమూర్తికి సంబంధించి లేవనియు నచ్చటి వైష్ణవోత్తములే చెప్పుదురు, వీనినిబట్టిచూడఁ దొలతనిది బాలాత్రిపురసుందరీ విగ్రహముగానుండి పిమ్మట వీరశైవము వెలసిన కాలమునవీరభద్రవిగ్రహముగానో కుమారవిగ్రహముగానో సంస్కరింపఁబడి యిటీవల శ్రీరామానుజులచే విష్ణుస్థలముగా మార్పఁబడియుండుననియుఁ దోఁచును. వేంకటశబ్దపరమైన ఈశ్వరశబ్దమే ప్రబలసాక్ష్యము ఈ విషయములన్నియు శ్రీపతిపండితులు వ్రాసిన శ్రీకరభాష్యమందు విస్పష్టమును. "నను వేంకటేశ్వర విశతేశ్వరస్థానే విష్ణోరీశ్వరశబ్దశ్రవణాత్, పరశురామావతారే తస్య బ్రాహ్మణకుల సంభవశ్రవణాత్ కథంక్షత్రియత్వముపదిశ్యతే ఇతి చేన్న, వేంకటేశ్వర స్యాభాసవిష్ణుత్వం తదంగే నాగభూషణాది ధర్మాణాంద్యోతనాత్, మూలవిగ్రహే శంఖచక్రాది లాంఛనానా మదర్శనాత్ వీరేశ్వరస్య రామానుజకల్పిత వేంకటేశ్వరత్వం రజ్జుసర్పవదాభాసమాత్రమేవ. కించ తత్ప్రాణ్యభోదేశే శివలింగదర్శ నాదీశ్వరశబ్దో వ్యవహ్రియతే" అనునీశ్రీకరభాష్యపంక్తులు వ్యర్థములా?

శ్రీకాకుళమునకు 8 మైళ్ళలలోనున్న శ్రీకూర్మక్షేత్రమందును విష్ణువుగా పూజింపఁబడు మూలమూర్తి కేవల పృథులింగాకారమే గాక శైవక్షేత్రచిహ్నములెన్నియో యుండుటయు శ్రీకూర్మనాథుఁడని వైష్ణవులు వ్యవహరించుకొన్నను శ్రీకూర్మేశ్వరుఁడను పేరు మాసిపోకశాసనము లందును వ్యవహారములనందును విస్పష్టము, గాన సంస్కృత శ్రీవేంకటేశ్వరుఁడు మున్ను శివశక్త్యాత్మక మూర్తియే కావలయును.

ఈ రహస్యములన్నియు సమగ్రముగా నెఱింగియే మన గ్రంథ ప్రకాశకులైన శివానందులు శ్రీ వెంకటేశ్వరుని గొల్చుటచే "ఏకాక్రియా ద్వ్యర్థకరీ" యనునట్లు కులక్రమాగత శివశక్త్యారాధనముతోఁ బరమార్థముచేఁ దదభిన్న విష్ణ్వారాధనము కలిసి వచ్చునన్నయెత్తు శ్రీవారి యోగ్యతను భాగ్యమును వెల్లడించుఁగదా.

శ్రీ వారణాసి జగద్గురు శ్రీ వీరభద్ర శివాచార్య మహాస్వాములు శ్రీరంభాపురీ జగద్గురు మహాస్వాములు మున్నగు మహాపురుషులు వీరికి వ్రాసిన శ్రీ ముఖ పత్రికలనుబట్టి యా గురుస్వాములకు వీరి యెడ నెంత వాత్సల్యమో యంత గౌరవమని తెలియును. మఱియు వీరి యందేమి విశిష్టత కలదో, లక్షల కొలంది వచ్చు బడిగల శైవ గురు పీఠాధిపతులు తమ మఠములందగు ప్రత్యుత్సవమునకును వీరి నాహ్వానించుటయకాక వీరి సాన్నిధ్య సాహాయ్యములను గోరుచుండునట్లు లిఖితములవల్లఁ దెలియుచున్నది

మన శివానందులు శ్రీ కాశీ గురుస్వాములను బంచవింశతి రత్నములతోను, శ్రీ మలయాలయస్వాములను అష్టోత్తరశత రత్నములతోను బూజించుటయు, శ్రీ రంభాపుర్యాది శైవ గురు పీఠముల కెన్నిసారులో నూటపదారులు సమర్పించుటయుఁ జూడ భక్తి వితరణాదుల మూర్తియే యనక తప్పదుగదా. ఈ గ్రంథ ప్రకాశనమువంటి యుదారకృతులు వీరి చేత నెన్నియై యుండునో?

ఎన్నిటినో తలచి చూడగా నీ శ్రీ శివానందస్వాములు చిన్నటనుండి పరవస్తు తత్త్వజిజ్ఞాసయు, పరమేశ్వరోపాసనయు, సత్య భక్తులతోడి పరిచయ సాంగత్యములే మహాధనముగా భావించి "పరోపకారార్థ మిదం శరీర" మ్మను మాట నన్వర్థము చేయుచున్న సత్పురుషులని విస్పష్టము

గాన శ్రీ వీరయ్య దేవరగారి (శివానందస్వామి) పవిత్ర చరిత్రము భారతీయులకు నందు ముఖ్యముగా నాంధ్రులకు నొజ్జబంతికదా దైవీ సంపద్విరాజమానులైన శ్రీవారికి జగత్పితలౌ పార్వతీ పరమేశ్వరులు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను బుత్ర పౌత్రాభివృద్ధిని బ్రసాదింతురుగాతమని పంచస్తవీ పాఠకులైన భక్తులెల్లరు నాశాసింతురని నమ్ముచున్నాను.

గ్రంథకర్త
శ్రీ శ్రియానంద నాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ

శ్రీమాత్రేనమః

# ము న్నుడి

---

ఉపనిషన్మతమునుబట్టి పరమాత్మ వస్తువు చేతనునిచే నుపాసింపఁబడు విధములచేతనే పలుమతము లేర్పడినట్లు తోఁచును.

సుప్రసిద్ధమతములందా పరమాత్మకును దచ్ఛక్తికిని భేదము లేదనుటయే శ్రుతినిశ్చితార్థము అనఁగా శక్తి శక్తిమంతులకు భేదము లేదనుట. ఉన్నదది యొక్కటే కాని రెండు లేవనుటయే యద్వైతము. బ్రహ్మాండ పిండాండములందు వెలయు సచ్చిదానంద స్వరూపమైన యా పరవస్తువును బ్రహ్మశక్తిగా నెఱింగి మాతృభావముతో నారాధించుట శాక్తాద్వైతము. ఆ బ్రహ్మవస్తువే శ్రీ శబ్దవాచ్యము. దాని యారాధనమే శ్రీ విద్యోపాసన. అది వేదసమ్మతము. ప్రాణాయామాది నియమసహిత యోగ విశిష్టము. త్రిపురా రహస్య కౌల భావనోపనిషదాదు లందుఁజూడనగును.

శ్రీ విద్యోపాసన యట్టిదికనుకనే ద్విజాతులకు ఉపనయన వేళనుండియే ప్రాణాయామ సహితముగాఁగఱపఁబడుచున్నది. కాలక్రమమున నావిధి యాచరణమందు క్షీణించుట చూడ నది దేశదౌర్భాగ్యమే యనఁదగును. ఎంత కాలమాయుపాసన ద్విజాలందుపేక్షింపఁబడ లేదో యంతకాలము కర్మభూమి యగు నీ భరతఖండమున మహాత్ములు, మేధావులు, ప్రజ్ఞావంతులు, శక్తిమంతులు, సిద్ధిసంపన్నులు కళాప్రపూర్ణులును వెలసి యీ ఖండమే యన్నిట మిన్న యనిపించిరి. వేదశాస్త్రార్థరచనము మున్నగు మహత్కార్యము లొనర్పఁగలిగిరి. అద్భుత సిద్ధులను బ్రదర్శించి దుష్కర కార్యములు లోకహితార్థముగాఁ జేయఁగలిగిరి.

ఎంతకాలము వేదమాత గాయత్రి భారతీయులచేఁ ద్రివిధముగ నుపాసింపఁబడుచుండెనో యంతకాలమును మన దేశమాత మేధాప్రజ్ఞాసంపన్నులయిన మహాకవులను భాష్యకారులను దుంబుర నారద తుల్యగాయకులను దైవజ్ఞ శిఖామణులను అణిమాదిసిద్ధధనులనుగన్నది. వారును బరాశక్తిని బరిచరించియే తన్మూలముగాఁగొన్న జ్ఞానధనము ననుగ్రహముతో శాశ్వతముగా నిహపరసాధనముగా ననుభవింపుఁడని మనకై విడిచి పిమ్మటఁదమ భౌతికకోపాధులనువిడిచి జ్ఞానానందోపాధులతో శాశ్వతులై యర్చావతార పురుషసమముగా నారాధింపఁబడుచు మనకుఁ గంటికిఁగానరాని యంతిలై యున్నారు. శ్రీ శంకర రామానుజానందతీర్థ కాళిదాస తిక్కన త్యాగరాజాదుల జయంత్యుత్సవములు నేఁడు జరుగుచున్నవియుఁ దార్కాణములేవదా. మన మాధనము ననుభవించి జ్ఞాన సంపన్నులమగుటకును బరదేవతనారాధింప వలదా? ఆ పరదేవతయే శ్రీమాత.

శ్రీవిద్య యనఁగా బ్రహ్మవిద్య యను మాటతెలియక యన్యథా గ్రహించి భ్రమపడి యిపుడీలోకము బెదరి చెదరుచున్నది. క్రమముగా సంస్కృత భాషాజ్ఞానము కొఱవడుట ఉపనిషత్ప్రామాణ్యము లేకుంటయుఁ దుచ్ఛఫలాపేక్షతో దుస్తంత్రములను ప్రమాణముగాఁ గొన్నవారు వేదనిందితాచారములను బ్రబలఁజేయుటయు లోకద్రోహులు స్వార్థపరులునైన గురు నామకులు పండితమ్మన్యులు వెలయుటయు, దాన సమయాచారము సన్నగిల్లుటయు సంస్కృత భాష తోడనే యాధ్యాత్మిక విద్యకింతయు రాజావలంబము లేకుంటయు మున్నగునవెన్నియో, దీనికిఁ గారణములు. ముఖ్యముగా సంస్కృత భాషకు వెల గలిగి వేదవిద్య పునరుద్ధరింపఁబడి తదుక్త వరివస్యా రహస్యము తెలియంగికొని బ్రహ్మ వస్తువు పాసింపఁబడినపుడే తొల్లింటి విభవ మీదేశమందఁగలదు. అలఁతి మానుష ప్రతిభకే వెల యిచ్చి ప్రేలాడుచున్నంత కాలమీదేశ మునకుఁ దొల్లింటి తపస్సంపన్నులగు మహానుభావుల జ్ఞాన విజ్ఞాన మహత్త్వలు వింతలుగాను గల్పితములగు కల్లలుగానే తోఁచును. అవి మనచే ననుభూతములు కానేరవు. మనచేఁ బ్రదర్శింపఁబడి యుత్తర సంతతులకుఁ దలుంగానేరవు. ఇహపరముల భగవదనుగ్రహ సంపాదనమున కీ యుపాసనమే యావశ్యకమని వేద మాత పల్కినదే శ్రీ గీతాచార్యులు 6వ యధ్యాయమునుండి గ్రుచ్చి చెప్ప మొదలిడిరి. గీతాసార బోధకులు. గీతా పాఠకులు. గీతాను వక్తలు, నిపుడు వేనవే వేలు. ఉపాసనాకాండము నుపేక్షించువారలే పెక్కండ్రు గాఁగా విభూతి యోగ భావమెటుల ప్రచారమునకు వచ్చును?

శ్రీ మాతృభావ బ్రహ్మోపాసన సమయాచార పద్ధతిని సార్వజనీనమై యుండెననియు, అది సర్వదా స్మర్తవ్యమై యుండెననియుఁదెల్పుటకు శుద్ధాద్వైత బ్రహ్మోపాసనకు సదా స్మర్త వ్యసాధనముగా ద్విజపురుషులకు సప్తవింశతి తత్త్వములకుఁ బ్రతినిధులైన 27 పోఁగులుగలిగి 27 తత్త్వముల కలితమైన బ్రహ్మమునకుఁ బ్రతీకమై బ్రహ్మ సూత్రమని పరఁగు జందెము నిరంతరధార్యమై యెటులున్నదో యటులే పిండాండ గత పరాశక్తి నుపాసించు క్రమమునఁ దద్బోధకములను దదను భూతి స్మారక చిహ్నములనగు శిరోభూషణములు స్త్రీలకు సర్వదా ధార్యములై యుండినవనుట షష్టిపూర్తియైన సత్పురుషులకు వింతకాదు గాని యిప్పటివారలకుఁ గడు వింతయే.

నాఁటి బోఁటుల నగలందుఁ జేరు చుక్క మొదలు అధిపతి మర్మమును (వెనుకటి తలను గానవచ్చు. శిరోజావర్తము : వెండ్రుకల సుడి) గప్పెడి రాగిడి నెలవంక వలుకుఁగల తలనగలే ఆజ్ఞాది ద్వాదశాంతముగానైన బింద్వాది షోడశాంతముగానైన యోగాను భవ విశేషాంశములను ధ్యాన యోగియైన ప్రతిగ్రహస్థునకు దన యిల్లాలి మోము చూచినంతనే స్మృతికిఁ దెచ్చు సాధనములుగా నుండెనన సందియము లేదు.

ఆ వివరణమును విమర్శ బుద్ధితోఁ జదువు గృహస్థ ధ్యానయోగికి బోధపడఁగలదు.

స్థూల సూక్ష్మ పరోపాసనముల క్రమ రహస్యమును సాముదాయికముగానే తెలుపుచు బ్రహ్మాండ పిండాండ సృష్టి సామరస్యము బోధించుచు శివశక్తితత్త్వమును బోధించు శ్రీ చక్రమే మున్ను శ్రీ శంకర భగవత్పాదులచే నుత్తరమున నుజ్జయిని వారణాసి మున్నగునవియు దక్షిణ

మున శృంగేరీ కాంచీ మున్నగునవియునైన పవిత్ర స్థలముల( బదునెన్మిదింట( బ్రతిష్ఠింప(బడి శ్రీ విద్యా పీఠములని వాసిగాంచి తద్విద్యాజిజ్ఞాసువులగు భారతీయులనేకులుత్తీర్ణులగుటకు(దోడు పడినవి. ఆ పీఠములందు( గ్రమ శుశ్రూష చేసి యుత్తీర్ణులయ్యెడివారు.

ఇంతేల? నేటి శ్రీనగరము నా(టి ప్రభువులచే శ్రీ చక్రమండలి నవావరణముల యను కరణముతోనె కట్ట(బడినది. శ్రీ లలితా సహస్రనామ భాష్యకారు(డును వరివస్యా రహస్యాది బహు శాక్తాద్వైత గ్రంథకర్తయు సర్వ శాస్త్ర పారంగతు(డునగు శ్రీ భాసురానంద నాథా పరనామునగు శ్రీ భాస్కరాచార్యు(డు కావేరీ తీరమున సమ్మతీ గ్రామమున శ్రీ చక్రాకార దేవాలయము నిర్మించి యందు శ్రీ చంద్రలాంబాదేవిని బ్రతిష్ఠించెను. ఇట్టి వెన్నియో శ్రీ విద్యోపాసనా బాహుళ్యమునకు సాక్ష్యములై మన దేశమున నున్నవి.

ఆ విధముగా నిత్యకర్తవ్యమగు పరోపాసన ప్రతి గృహమున వికసించినది. దాని రహస్యములు నుపయోగములును గ్రమముగా విస్మరింప(బడుటకు దౌర్భాగ్యముచే( బురుషులందయిన పరివస్యోపేక్షయే హేతువు. కావుననే పైని సూచించిన యిల్లాలి రాగిడి మున్నగు తల తొడవులు మోటునగలుగా నెన్న(బడి క్రమముగా నామావ శిష్టములైనవి. నానా(ట భావి భామినీ సంతతులందు వానికి నామావశిష్టతా భాగ్యమును లేకుండును. పరికింప నపయాచాద నిపుడు వీథి నాటకములందు (భాగవతములు) స్త్రీ వేషధారుల తలలపైని మఱియు( గొన్ని హిందీ చలన చిత్రములందును గాన(బడును. ఆ హిందీ సినీమాల యందును చేప చుక్క, అర్ధ చంద్రు(డు, పావటబిందులు మాత్రయే తఱచు గాననగును.

అది యటులుండనిండు. వైవాహికబంధము శివశక్తియోగమును దెలుపుచు బ్రహ్మానందానుభవఫలకమను మాటయే తెలియక కేవల తుచ్ఛమానుషానందముగా(జేలి పోయినది.

ఇంతేల? ఇపుడు వడుగువేడుక యన(గా బ్రహ్మవిద్యాభ్యాసారంభోత్సవమని చెప్పి వటునకు ధరింప(జేయు జందెపు 'పో(' చ కందువమును దెలుపు నాచార్యులెందఱు? తెలియ(జెప్పించు తండ్రు లెందఱు? నే(టి వటువులును "గర్భాష్టమేషుబ్రాహ్మణముపనయీత" యను మాట పోయి పదునాలేండ్లు దా(టిన వారలే కదా; ఇంటర్ బి"ఏ"క్లాసు విద్యార్థులే కదా; వారి యందయినను మాపెద్దలు వ్యయప్రయాసములకు లోనై చేయుచున్న యీ యుత్సవము తత్త్వమేమి యని తెలిసికొన(గోరు వారెందఱు? "ఓం భూః" ముక్కు పట్టుకో "యని ఎవరి ముక్కో కూడచెప్పక పట్టించు నాచార్యు(డే కాని దాని విధానప్రయోజనములను దెలుపువా(డు లేడు కదా; అవి తెలుపనపుడు ముక్కు పట్టించిన నేమి? చెవి పట్టించిన నేమి? జిజ్ఞాసువులున్నపుడు గురువులకొదువ నే(టికిని లేదు." ఓమిత్యేకాక్షరంబ్రహ్మ "యన్నది మొదలికి దీని వినియోగము సాయుజ్యమే యని యాబ్రహ్మశక్తిని మాతృభావములో నుపాసించునపుడు క్షిప్ర వరద యగునని తెలుపుచు" గాయంతంత్రాయతఇతి గాయత్రి "తన్ను గానము చేయు వారిని గాపాడునది యని నామరూపరహితవస్తువునకు గాయత్రీనామమే యిడి. అయిదువర్ణముల అయిదు మోములను వివిధపరికరములతో(గూడిన పది చేతులును గల స్త్రీరూపమునే కల్పించి తదనంతకల్యాణగుణముల(గొన్నిటిని నిత్యస్మర్యములు గాసూచించి దానినే యుపాసింపుమని

స్థూలోపాసనమును, ఓం భూర్భువరిత్యాది బీజములను బ్రహ్మతత్త్వమును బోధించువానిని జే
(గాయత్రీ) మంత్రమును శ్రుతినుండి యుద్ధరించి యర్థసహితముగా జపించి మానుషజన్మ
వలని ఫలమునొందుమనిరి. ఇది శ్రీవిద్య కాదా? బాలాదుర్గాదిమంత్రముల నుపాసించినవా
శ్రీవిద్యోపాసకుఁడా?

ఆ వేదమాతృపంచముఖములయు నాయమ్మ పదిచేతులందయిన పరికరములయు
పాయములను విజ్ఞులవలన నెఱింగికొనునది. గ్రంథబాహుళ్యశంక నిందు వ్రాయనైతి
ఆ గాయత్రినే వేదమాత యనిరి. ఆరహస్యార్థములను దెలిసికొన్నపుడు ఆతల్లి సర్వశక్తి
బ్రహ్మపదార్థమే యనియుఁదన్ను సేవించువారికి ఇహపరములందావశ్యకములగు నన్ని
బ్రసాదించునది యనియు నానందము గలుగక పోదు.

స్థూలోపాసనకై కల్పితమగు మూర్తివిశేషాభిప్రాయములను, సూక్ష్మోపాసనకై మంత్ర
ద్రష్టలైన ఋషులు పలికిన బీజాక్షరములయర్థములను ఉద్దిష్టదేవతామహిమమునే బోధించు
ననతికాలముననే మంత్రమంత్రిమంత్రదేవతల కభిన్నతను మనసుననాటించి సాధకుని జ్ఞా
నందమయుని జేయును. మంత్రాక్షరములనంగముల న్యసించుకొనుట యిందులకే. సరా
నాదరూపాక్షరవస్తువును నాదరూపాక్షరములలోనే అర్థయుతముగా నుపాసించుటే మంత్రో
చ్చారణము. కావుననే "మననాత్త్రాయత ఇతి మంత్రః" ఎల్లపుడును అర్థమును దలంచి
కొనుటచే ఆపరవస్తులక్షణములుబోధపడి స్మృతిరూపమై కాపాడునది యని యర్థము. ఇక్క
మంత్రాక్షరముల యర్థము గుప్తముగానుంచుట నది తెలియక జపించుట గాడిద గంధపుఁగట్టె
మోచినట్లే యని భాస్కరరాయాదులనిరి. కావున బ్రహ్మవస్తునిరంతరధ్యానార్థచింతన
లావశ్యకములని శాసనము. ఈ శాసనమునకనుసరించి నపుడు, పరోపాసన రహస్యము పట్టుపడి
"అన్నెలలు స్నేహము చేసినచో వీరు వారగుదురు" అహంబ్రహ్మాస్మి - తత్త్వమసీత్యాది మహా
వాక్యార్థము చక్కఁగా ననుభూతమై జన్మసాఫల్యముంగాంతురనుట, ఉపాసన యనెడి చిత్తై
కాగ్ర్యసాధనమున జ్ఞానసిద్ధి యనుటయే కదా. మంత్రాక్షరములకు బీజసంజ్ఞ మున్నగు విష
ములను విపులీకరింపఁబూనుచో నది యొక గ్రంథమే యగును గాన జిజ్ఞాసువులు విద్వాం
లఁజేరి గ్రహించునది.

నడుమ విడిచిన యిల్లాలి తలజొదపుల రహస్యవివరణమించుకంతి చదువరుల వినో
మునకై యిటఁజేయుదును.

జడమొత్తమే యుపాస్యయు ఉత్థాప్యయునగు కుండలినీప్రతినిధి. కుండలిని ప్రాణాయా
మసాధనమున మూలాధారమునందలి కులకుండమును వీడి స్వాధిష్ఠానాదిభూమికలుదాఁ
లలాటమధ్యసహస్రారములను జేరునపుడు యోగి జాగరస్వప్నములను మాటి సీమం
మూలము దిగువ లలాటమధ్యమునఁగాంచు బిందురూపమే చుక్క. ఇదే చేర్చుక్క. కీ
ప్రతినిధియే బొట్టు. దీనిని విడిగా నుంచుకొందురు గాని నగలలో పాపటమొదల ప్రేలు
చంద్రాకారమగు నగతోఁగలిసి దానిక్రింద ప్రేలుచుండవలసినదే. అది మొదలు రాగిడివ
నైన శిరోభూషణమాల యంతయు నొకప్పుడెడముగా నుంచినపుడు ఫాలము శూన్యము

నుండరాదని బొట్టుంచుకొనుట. అది మొదలు రాగిడి దాఁక ఒక్క చేపనందే యన్ని నగలు నమర్పఁబడి యుండును గాన దీనికిఁ జేరుచుక్క యని పేరు. మహాబిందు (రాగిడి) స్థానమునే అధిపతి మర్మస్థానమని యాయుర్వేద శారీరము చెప్పుచున్నది. అదే శిరోమర్మములందుఁ బ్రధానము. శిరమునందెన్ని మర్మములున్నను అధిపతి మర్మము నందభిఘాతమైనచో సద్య: ప్రాణహరము. పంచదశ కళాధిపతియగు చంద్రుని స్థానమదే గావున దాని నధిపతి మర్మమనిరి. యోగి యచ్చటనే యోగవేళ మహాబిందువు ననుభవించును. ఆ ప్రాధాన్యమును బట్టియే దానిని గోష్పాద మాత్రశిఖచేఁ గాపాడుకొమ్మనిరి. అది యెఱుంగక యిప్పటివారు కోల్పోవుచున్నారు. కేరళీయులు బ్రహ్మరంధ్ర స్థానమునకే ప్రాధాన్యమిచ్చి నడునెత్తిని శిఖనుబెంచి దాని రక్షించుచుందురు. కాని అధిపతి శబ్ద వాచ్యము శిరఃపశ్చిమభాగ మర్మస్థానమగు రాగిడి యుండు చోటే ఇచ్చటనే పంచదశకళాధిపతి యగు మహాబిందువును దాని క్రిందనే తన్మూలమైన షోడశి యను పేరి పరాకళయు ననుభవింపఁబడును. ఆ పదునేను కళల చంద్రుని ప్రతినిధియే రాగిడి. దాని వెన్క పెద్దనెలవంకయే షోడశకళ. అదే సాదా సరాయను పేరి బ్రహ్మకళ. కావుననే శ్రీవిద్య చంద్రికా విద్యయను బ్రహ్మ విద్యయని ప్రసిద్ధి.

ఇఁక బిందువు (చేరుచుక్క)నకును, మహాబిందువునకును (రాగిడికిని) సంబంధించి చేప నంటి యుండి నడుమ నున్నవాని క్రమ వివరణ మేమన:—

అర్థచంద్రిక:— అర్థ చంద్రాకారముగానుండి పాపట మొదట వ్రేలు నగ.

రోధిని:— తమలపాకును బోలిన నగ.

నాదము:— మొగలిరేకును బోలిన నగ.

నాదాంతము:— చేరున కిరువంకల సూర్యచంద్రులను బోలిన జంటనగ.

శక్తి:— పోకచెక్కను బోలిన నగ.

వ్యాపిక:— కోను బిల్ల (త్రికోణ భూషణము.)

సమనా:— వరుసను రెండు సేమంతి పూలు.

ఉన్మనీ:— పెద్ద సేమంతి పూవు.

మహాబిందువు:- రాగిడి యను పెద్దపూవు.

షోడశీ:— దాని క్రింద వెన్నెల వంక.

| యోగానుభవములు:— | స్త్రీ శిరోభూషణములు:— |
| --- | --- |
| (పరా, సాదా) షోడశీకళ (మహావైసర్గికీ) | వెన్నెలవంక |
| మహాబిందువు | రాగిడి |
| ఉన్మనీ | పెద్ద సేమంతిపూవు |
| సమనా | చిఱు సేమంతి జంట |
| వ్యాపినీ | కోనుబిల్ల |
| శక్తి | పోకచెక్క |
| నాదాంతము | సూర్యచంద్రులు |
| నాదము | మొగలిరేకు |
| రోధిని | తమలపాకు |
| అర్ధచంద్రుఁడు | పాపటబొట్టు |
| బిందువు | చేరుచుక్క (బొట్టు) |



ఇవి గాక పాపటబిందులు - పాపట మొదటనుండు అర్ధచంద్రుని స్థానమునుండి చెవుల వెన
కకు వ్యాపించియుండు ముత్యాలతోఁ గూడిన చేరులు. ఇవి సహస్రారమునుండి జాల్వారు
అమృతబిందుజాలప్రతినిధులు. ఈ నగలే సుషుప్త్యాదిదిర్యాతీతావస్థాంతము యోగిచే
ననుభవింపఁబడు బింద్వాది మహా బింద్వంతమైన విశేషములు. వీని పైదే షోడశీకళ. పర
సాదా మహావైసర్గికీ ప్రథతో నొప్పు బ్రహ్మకళ. దాని ప్రతినిధియే రాగిడిక్రింది వెన్నెలవంక

అదే రమాబీజ (శ్రీం) వాచ్యము. కావుననే దీనికి శ్రీవిద్య అనియుఁ జంద్రకళావిద్యయనియు శాస్త్రవ్యవహారము.

ఇట్టి చంద్రకళను నిత్యము నుపాసించు వారలు కావుననే మన పూర్వులు సర్వ శక్తిమంతులై దూరదృష్టి దూరశ్రవణ సర్వ రోగహరణ సర్వవశీకరణ శత్రుస్తంభన క్షోభణ వినాశనాదులే కాక పరకాయప్రవేశశక్తియును నొంది యుండెడివారు. శ్రీ శంకర భగవత్పాదులు పరకాయ ప్రవేశ శక్తిని బ్రదర్శించిరనుట వారి చరిత్రమున విస్పష్టము. వారి సౌందర్యలహరి యందలి 84వ శ్లోకము 360 దినములు. దినమునకు వేయి సారులు. పారాయణము చేయుచు శ్రీ చక్రము నర్చించుచున్నచోఁ బంచదశీమంత్రసిద్ధులకు ఈ శక్తి యలవడును. ఆ గ్రంథమందలి 100 శ్లోకములును 100 మంత్రములే. 100 శక్తులను బ్రసాదించు మహిమగల బీజసంపుటి కలవియే. ఈ రహస్యవివరణము కైవల్యాశ్రమప్రకటితవ్యాఖ్యయందును మైసూరు ప్రభువులు ప్రచురించిన ప్రతియందును అదయార్ దివ్యజ్ఞానసమాజమువారు ప్రకటించిన ఆంగ్ల వ్యాఖ్యాంతమునను సుబోధము కాఁగలదు. అక్కడవడియు పరిశీలనౌత్సుక్యముతోను అందాటిని నేను సమర్థించి ఫలమమోఘమని సాక్ష్యమిచ్చుచు శ్రీ శంకర గురువులకుఁ గృతజ్ఞతావందనములు మఱి యొకసారి యర్పించుచున్నాను.

పైని వివరించినటులు శ్రీ భాస్కరరాయరచిత వరివస్యారహస్యవివృతియందలి యోగానుభవస్థానవిశేషములకే యిల్లాలి తొడవులు ప్రతినిధులై యా విశేషములు నిత్యస్మర్తవ్యములుగా నుండెడివని తేలినది. ఇవి యోగవిశేషములే. ఇది పరాంబికారాధనమేయని తేలినపుడు ఏ స్త్రీనిచూచినను మాతృభావమే యేర్పడునుగదా.

దీనిని బట్టి యాల్మగల సంబంధమెట్టిదో తత్సమావేశమునఁ అన్యోన్యము బొందఁదగు నానందము కేవల మానుషమో బ్రాహ్మమో, యిల్లాలికెట్టి గౌరవస్థానము మన పూర్వులచే నీయఁబడెనో, యోగవిద్య గార్హస్థ్యమందును నెంతగా నా చరితమై యుండెడిదో గ్రహించునది. కావుననే యిల్లాలిని గృహలక్ష్మి యనియు సౌభాగ్యవతియనియు గౌరవించుచుండెడివారు. సౌభాగ్య విద్య యనఁగా మహా త్రిపురసుందరీ పంచదశాక్షరవిద్య.

అందలి ప్రత్యక్షరమునకు అధిష్ఠానదైవమును వాని విశేషార్థములను, దన్మంత్ర భందతయమును గ్రమముగాఁ జక్రములందు న్యసించుకొనువిధమును వాని ఫలముల నెఱింగి మనన సహితముగా నాదగత దృష్టితో జపించుట కర్తవ్యము.

సౌభాగ్య లక్ష్మ్యుపాసనమును బోధించు భాగమే సౌందర్యలహరి యందలినలువదియొక శ్లోకముల గ్రంథము. దానికే ఆనందలహరి యను పేరు. దాని వివరణము నాయనువాదమందు సంగ్రహముగను లక్ష్మీధరాది వ్యాఖ్యలందు విపులముగను గాన నగును.

ఇఁక నిత్యము మనము పారాయణము చేయు శ్రీ సూక్తరహస్యమేమి? దాని బఠించు వారలే కాని యది పిండాండాంతర్గత కుండలినీపరాశక్తి సూక్ష్మపరోపాసనానుభవకాండమ

మెఱింగిన వారపుడు ఆ పాఠము కేవలసంపల్లక్ష్మీరూపస్థూలశక్తిఫలకమే యని పఠం-
సంతుష్టినొందువారలే కాని పరసాధనమనియు నుపాసనమందు మహర్షులు తామనుభవిం-
వానింజూపి యనుగ్రహించిరే యనియు గ్రహించి స్వానుభవమునకుందెచ్చుకొన్నవారునను-
పరాశక్తి సాధకునిచే నుపాసింపఁబడునపుడు యోగి యెట్టి యెట్టి యనుభవముల నొందున
యది యెల్ల ఫలశ్రుతియుతముగా స్పష్టీకరింపఁబడినది. సౌభాగ్యవిద్యాహృదయార్థము-
దెలిసికొన్నపుడు ఆయనుభవములే శ్రీ సూక్తమున వివృతము-
లనియు స్థిత్యుపకారి స్థూలలక్ష్మీ ఫలప్రదములుననియుఁ దేటపడును. నావ్రాసిన శ్రీ సూక్తరహ-
స్యార్థము శ్రీ మాతృకరుణచే ముద్రితమై వెలువడునే నందుఁగొన్ని విశేషములు గానఁగలరు.

ఇందుఁదుదినేఁడొందు వఱచిన సౌభాగ్యవిద్యాహృదయము చదువరుల వినోదమునకుఁ గాకపోదు.

ఇఁకఁబ్రకృతమునకు వత్తము.

ఇట్టి పరోపాసనమందుఁ బరిణతుఁడైన మహా పండితుడు, శ్రీ మాతృపరిపూర్ణకృపా పాత్రుఁడునైన పుణ్యాత్ముఁడెవఁడు? మహాకవి శ్రీకాళిదాసుఁడొక్కఁడేయని నాయుహ విశ్వాసము.

బాలాదుర్గాద్యనేక దేవతామంత్రజపక్రమములందు నీ మహాకవి రచించిన ధ్యాన శ్లోకములే వాడుకలఁగానవచ్చును. కొన్ని శ్లోకములు మన మహాకవిరచిత శ్లోకాభి ప్రాయములతోనే యితరులవికానఁబడును.

ఈ మహాకవి వ్రాసిన "చిగ్గగనచంద్రిక" యను కృతి రఘువంశకావ్యాదిని గన్పడు మహామంత్రప్రాయమగు "వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే । జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" అను శ్లోకపు విపుల వ్యాఖ్యయే. అందే తన పూర్ణపరిణత జ్ఞానమును బ్రదర్శించెనాఁడు. సార్థకాఖ్యమగు నా గ్రంథమున కింతదాఁక వ్యాఖ్యానములు పుట్టకుండుటకుఁ గారణమేమి? ఆ ప్రయత్నము కాలిదవింబ్రయాణము నేయుట, ఆకసమున ముగ్గులు వేయుట, కడలిని దెప్పలేక యీఁదుట వంటిది. ఆయారంభమున కంతవాఁడే కావలయును. వేద వేదాంగ వేదాంత బహుశాస్త్రపరిచయ కూలంకషదేవభాషాపాండితులటుంచ నఖండ దేవ్యు పాస నోత్తీర్ణుఁడైన పరమ పుణ్యాత్ముఁడు కావలయును.

పదేండ్ల వెనుక గోదావరిజిల్లా లూటుకుర్రు గ్రామవాసులు వైదిక వరివస్యానిష్ణాతులు సర్వతంత్ర రహస్యాభిజ్ఞులు వేదవేదాంగ పారంగతులు శ్రీ ధనదానందనాథాపరదీక్షాభిఖ్యులునైన బ్ర॥ శ్రీ కర్రా అగ్నిహోత్ర శాస్త్రులు దానికి నడుముకట్టి "దివ్యచకోరిక యను పేర విపుల వ్యాఖ్యవ్రాసి కృతార్థులై దేవ నాగర లిపియందు ముద్రింపించి సాధక లోకమున కసాధారణోప కారముంజేసిరి. కాని యావ్యాఖ్యానమును గాళిదాసునంతవానితోనో శ్రీ శాస్త్రులవారితోనో కలవ వలసినదే. అగును. అట్టి యుత్తమాధికారిపఠనోచితమహాగ్రంథవ్యాఖ్యలు తత్తదు చిత శ్రుతివాక్య బహుశాస్త్ర తంత్రోద్ధృత విషయములతో నుభయాద్వైతపారిభాషికములో

భూషితములై యుండునపుడు రఘువంశాది కావ్యవ్యాఖ్యలంబోలి, సుభావగాహయోగ్యములై యెట్లుండును? శ్రీ శాస్త్రిగారిని బ్రార్థించి మాతావునకు రావించుకొని క్రమపాతముగా వింటిమి గాని మలినాలుగు సారులైన శుశ్రూష చేయక పూర్తిగా నెత్తికెక్కదనిపించినది.

శ్రీవారే తెనుఁగున గ్లిష్టవిషయ వివరణములతోఁ బ్రకటించి లోకమును సంతుష్టిపరచుటేగాక మహాకవి యమేయ ప్రతిభలోకమునకు వెల్లడింతురుగాక యని కోరుచున్నాము.

శ్రీకాళిదాసుఁడు శాక్తాద్వైతమున నెన్నియో కృతులు వ్రాసియుండును. గాని లోకమునకు శ్రీమాత ప్రసాదించిన వానిలో ముఖ్యములు శ్రీదేవీపంచస్తవి మధ్యమాధికారులకును, చిద్గగనచంద్రిక యుత్తమాధికారులకును జాలను.

అస్మాదృశులకీ పంచస్తవియే కొన్నిచోటుల మెదఁబడిన యుమ్మెత్తికాయ, నిజముగా నేను దీని యనువక్తగా బయలుదేరుట పరమసాహసము. "సహసావిదధీతనక్రియా" మను భారవిమాట నీ వెఱుఁగనిదికాదే. ఎందులకీ తెగువ యందురేమో? పూనుకొని యొకతెంపరిదిగినపుడే పండితులు తద్విద్యాసంపన్నులు నిజనిశితసూక్ష్మబుద్ధులందుఁ జొనిపి సవిమర్శముగా దోషములను జూపుదురు. ఈ తెంపరియు రెండవకూర్పున దిద్దుకొనఁగలఁడు. వీని యుపాధి పదినను దరువాతి సామయికులలో నొకవిద్వత్కవి సమగ్ర నిరుష్టానువాదమును జేసి జగదుపకారి కాఁగలఁడు. ఇటులెన్ని యుద్గ్రంథములకో యసమగ్రవ్యాఖ్యానువాదాదులు పుట్టుటయు, వానినిబట్టి నిర్దుష్టానువాదాదులు బయలుదేరుటయుఁ గానలేదా? ఇదియే నాతెంపునకుఁ గతము.

1. ఈపంచస్తవములందుఁ దొలిది. లఘుస్తవము, అనఁగా చిన్నది - చతురమైనది, మనోహరమైనది. యను నర్థములున్నను, మంత్రశాస్త్రమహాసౌధమునకుఁ బూనాదిరాళ్లగు బాలామంత్ర బీజములను మూటిని వేర్వేఱుగను సముదాయముగను నుపాసించు విధముదెలిపి లఘుతరబోపాయమిదియేయని నొక్కిచెప్పుచు సగుణస్థూలోపాసనయందుఁ జాతుర్వర్ణ్యోచిత నివేదనద్రవ్యములను సూచించి దేవిసర్వప్రద క్షిప్రవరద యనుటయేగాక, మహాకవియయ్యు దనయందు లాఘవమునారోపించికొన్నందున నిది లఘుస్తవము.

2. చర్చాస్తవము. చర్చా — పలికినదేపలుకట, లఘుస్తవమునఁగల ప్రధానవిషయములనే మఱల నుద్ఘాటించి హితముచర్చించుట లోకానుగ్రహదీక్షల గుణముగాఁ జేసినదిగాన నిది చర్చాస్తవము.

3. ఘటస్తవము. మనమహాకవి శరన్నవరాత్రాది దీక్షాకాలములందొకదాన దుర్గాప్రతినిధిగా నుంచుకొన్న ఘటముసన్నిధినుండి తాఁజేసిన స్తవముగాఁదోఁచును. ఇందుఁ బ్రథమశ్లోకమున మహిషమర్దన మహిమయుతస్తవమునే చేయుటయు మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపిణివి నీవేయని ప్రతిపాదించుటయుఁ జూడనిది ఘటస్తవమనఁదగియున్నది.

4. అంబాస్తవము. శ్రీదేవియందు మాతృభావముంచి తనయందు, బాలత్వమునారోపించుకొని చేసిన యీ స్తవమందలి 32 పద్యములలోఁ బదునైదింట "అంబ"యని సంబోధించుటయ కాక పరోపాసనా సాధసోపానముల కెగఁబ్రాకఁ జొచ్చెఁగాన నిది యంబాస్తవము.

౫. సకలజననీస్తవము. "శ్రీగురుః సర్వకారణభూతాశక్తిః" అను వేదశిఖావాక్యమున ప్రతిపాదింపఁబడిన సకలాండచరాచరసృష్టిహేతుభూతయై సర్వగతయై సర్వాంతర్యామినియై సర్వస్వరూపిణియైన పరాశక్తికిని సచ్చిదానందస్వరూప పరమశివునకును నభిన్నత స్థాపించుచుఁ బరోపాసనావిశేషములందుఁ దనయనుభవములను బూర్ణముగాఁ దెలిపి "సకలజనని" విశ్వజనని" "త్రివలయతను" మున్నగు పదములతో సంబోధించుచు నీవుకానిదితరము లేదని నొక్కిచెప్పుటచేనిది సకలజననీస్తవమను పేరఁబరఁగును.

ఎన్ని శాక్తగ్రంథములు చదివినను వరివస్యానుభవములను ఉద్దేశమున కనుఁగణమైన యుపాసనయందలి విశేషానుభవములను అరటిపండొలిచి చేతఁబెట్టినట్లుచూపి చెప్పినవాఁడులేడు. వానిని హృద్గతముచేసికొని తన తరువాలి వారును దన్ననుసరించి ఇహమున సకలభోగములంది పరానందానుభవముతోఁ బరశివపదము నొందవలయుననెడి లోకానుగ్రహదీక్ష యితనిదే. ఇట్టి లోకానుగ్రహమెన్నిటనో కందుముగాని ఇంతయో అంతయోగుప్తమే. మన మహాకవియో గోపనమన్నది మాని స్వానుభవములను వెల్లడించినపుడే లోకోపకారినై దేవ్యనుగ్రహపాత్రుఁడ నౌదునను నిరుకుగల వాఁడుగాఁదోఁచును.

మఱియు మహాకవి తనకభీష్టమై యర్థించునది సకలజనని శ్యామలతేజస్సెయని పలుతావు లననుటయకాక యంతిమ పద్యమందును దానినే యర్థించుటచూడఁదన పేరినిబట్టియు "కలౌకాళీ" యను తంత్రోక్తిచేతను విశేషించి దక్షిణకాళ్యుపాసకుఁడు కావలయును, లేదా, శ్యామలోపాసనము దేవ్యుపాసన సిద్ధికి సాధనముగా మున్నుకర్తవ్యమను నిత్యాషోడశికార్ణవోక్తినిబట్టియుఁ బలు రావులఁజేసి యుండును. మఱియు దాఁదొలుత నెత్తుకొన్న బాలాత్రిపురసుందరీధ్యానశ్లోకము లందుఁగొన్నిట శ్యామవర్ణగాఁగనిపించుటచేతను నట్లు శ్యామతేజస్సు నభినుతించియుండును.

అభిమతవస్తువది కావచ్చునుగాని బాలామంత్రబీజములతోనే స్తవారంభముచేసియు, మాయాబీజమునకును బ్రాశస్త్యమిచ్చియు సర్వబీజశక్తియు వానియందే యంతర్భూతమను రహస్యమును సూచించుటఁజూడ, బాలామంత్రము షోడశీభేదమని తక్కినవానివిడిచినట్లును దోఁచును. బాలామంత్ర వ్యాఖ్యను దెలిసికొన్నపుడిది విశదము కాఁగలదు.

కీ॥ శే॥ పండిత దిగ్గజములు, శ్రీ విద్యోపాసనయందలి లోఁతులెఱిగినఁ వారును వయోవృద్ధులునైన బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణ దాసులు, మహోపాధ్యాయ, తాతాసుబ్బరాయశాస్త్రులును బ్రసంగవశమున నొకప్పుడు నాయనా! క్రమోపాసితమగునేని బాలావిద్యయొక్కటి చాలదా? యనిరి. అమ్మాట మహాకవి పంచస్తవి చదివినపుడు నచ్చినది. అందే యాతఁడు త్రిపురసుందరీమహిమను నోపినంతగా నుతించెను. పలుసారులు త్రిపురసుందరీ పర్యాయముల దొరలించుటయు, ఆ మూలచూడము సమయాచారరహస్యముల ననుభవములను వెల్లడించుటయు, విప్రోచితనివేదనద్రవ్యము పాలేయని శాసించుటచేతను, నీ విప్రసత్తముఁడు, మనదేశమునఁగ్రమముగానగు బాలాపంచదశీషోడశీక్రమమున మెట్లెక్కిన వీరసమయాచరియే గాని లోకులు కొందరనుకొనునట్లు వేదనిందితాచారముల పొంతఁబోయినవాఁడుకాఁడని స్పష్టము.

ఔరా! ఎంతధీరత! ఎంతస్వాతంత్ర్యము! ఎంతపటిమ! ఎంతయౌచిత్యము! ఎంతమార్దవము! ఎంతమాధుర్యము! ఎంతచదివినను దనివితీరదు కదా!

విద్యయనుపేరఁబిలువఁదగినదెల్లఁ గాళిదాసునకుఁగరగతమని యాతనికావ్యములను జదివిన వారలకెల్లఁదెల్లము. తన ప్రతికావ్యమందును శివశక్తిసమారాధనము రౌలతనో నడుమనో కొననో ప్రకటముగానో గుప్తముగానో చేసియే యున్నాడు.

ఆత్మానాత్మవస్తుజ్ఞానమెంత గల్గినను సకలాంతర్గత బ్రహ్మవస్తువు క్రమోపాసితమగునపుడే త్రిపాద్విశిష్టభగవదనుగ్రహముగలిగి జీవుఁడు ముక్తుఁడగుట శ్రద్ధాచరితోపాసనచేతనేయని శ్రీగీతాచార్యులబోధ యాఱవ యధ్యాయమున స్పష్టీకరించెను.

ఆ పరవస్తువు చిననాటినుండి మాతృభావములో వరివసింపఁబడినపుడే క్షిప్రసిద్ధిప్రదమను నిశ్చయమునకువచ్చిన మహర్షులు శ్రుతిసమ్మత వేదమాతృపాసననే యుపనయనకాలమునందే కలిపిరి. మఱియు పెద్దలనేకులు ప్రకట గాయత్రిని గుప్తగాయత్రియగు బాలామంత్రములో సంపుటితముచేసి జపించుట యేనెఱుంగుదును.

మన మహాకవి, యిందు సత్కవిత్వాప్తి, సంపత్సిద్ధి, స్వరూపజ్ఞానము, సర్వవశీకరణము, సామ్రాజ్యసిద్ధి, ఆపన్నివారణము, యశఃప్రాప్తి, వ్యాధినివృత్తి, మృత్యుంజయము, దారిద్ర్యహరణము, జగద్గురుత్వాప్తి, తుదకు శివైక్యాప్తి యను ఫలములందుటకై చూపిన ధ్యానమార్గవిశేషములు తదనుభవములు, సమయాచారులకెంత యుద్బోధకములో యెంతయుపకారకములో వ్రాయ నాతరముకాదు. ఆస్తిక శిఖామణులు చదివి గురుశుశ్రూషయొనర్చి, యాచరించి ఫలానుభూతి భాగ్యము నందవలసినదే.

ఇంకను దేవీపారమ్యము నుగ్గడించునపుడు, "శ్రీగురుఃసర్వకారణభూతాశక్తిః" యను మాటను బ్రతిపాదించునపుడు, కుండలిన్యుపాసనానుభవములను సువ్యక్తీకరించునపుడు, "శివోహం, తత్త్వమసీత్యాది" మహావాక్యబోధక వాక్కులనునపుడు, భక్తితీవ్రతాలక్షణములను బలుకునపుడు, సానురాగప్రార్థనములు చలుపునపుడు, "సోహం సాహ"మనునైక్యభావమునుగ్గడించునపుడు శివశక్త్యభేదముంజెప్పునపుడు జగదంబకడఁజనవు చూపునపుడు నిరాడంబరోపాసకుఁడు — "మహాకవీ! నాయనా! కాళిదాసుఁడా! ఇంతవాఁడవుగావుననే, జగన్మాతచే "త్వమేవాహ" మని మెచ్చిమమ్మాఅనిపించుకొన్న ధన్యుఁడవు. నీవున్నావు. ముందుగా నీదర్శన మిమ్మని ప్రార్థింపకుందునా?

వేయునేల? ఉపాసనారహస్యానుభవముల ననుగ్రహముతో లేఁతమాటలలో లోకమున కందిచ్చిన యీతఁడే జగద్గురుఁడని మఱియొకసారి మ్రొక్కి—

ఈ నీకృతికైన నాయాంధ్రానువాదకృతిని, నన్ను సకలజననీ పాదపద్మములందుఁదన కృపాదృష్టిద్వారమున హస్తమస్తకసంయోగశక్తిపాతమూలమునఁబట్టించిన తపోనిధి శ్రీ శ్రీ విద్యానందనాథగురుచరణముల సమర్పింప ననుజ్ఞ యిచ్చి, వాగర్థరూపముగా శాశ్వతుఁడవైననీ

ఈకృతిసమర్పణోత్సవ వేళ సాన్నిధ్యమిచ్చి, నన్నాశీర్వదింపుమని ప్రార్థించుచు—కడునిడుమై
నాఁడున్నడింజదువ వినిపించిన నను మన్నింపఁజదువరులను వేడుచు—

నా సౌందర్యలహర్యనువాదమున కభిప్రాయములిచ్చిన శ్రీ శ్రీ శ్రీజగద్గురు కళ్యాణాన
భారతీమాంతాచార్య మహాస్వాములకును, ప్రణవతత్త్వాచార్యేత్యాది ద్వాదశబిరుద భూషిత
శ్రీమాన్ ముడుంబై వేంకటాచార్యులవారికిని, ఉభయభాషా పారంగతులు, శ్రీ విజయన
మహారాజ సంస్కృతకళాశాలా పండితులునగు బ్రి. శ్రీ. ఆకుండి వేంకటశాస్త్రిగారికిని–

"అమ్మతో ముచ్చట"లను నాపద్యత్రిశతికిఁబీఠిక వ్రాయుటయకాక నాస్ఖాలిత్యముల
జూపిమేలుచేసిన, అభినవతిక్కన, సాహిత్యస్థాపకాచార్యేత్యాది బిరుద విరాజమానులును, ఉ
గ్రంథకర్తలునగు నెల్లూరు వాస్తవ్యలు బ్రహ్మశ్రీ దుర్భాసుబ్రహ్మణ్యశర్మగారికిని—

ఈ నా పంచస్తవ్యనువాదముననుశీలించి యభిప్రాయములిచ్చిన (1) గుంటూరు వా
సౌందర్యలహర్యనువాద శ్రీ కృష్ణతులాభారాద్యనేక గ్రంథకర్తలునగు బ్రహ్మశ్రీ మద్దూరి
బయ్యకవిగారికిని—(2) నెల్లూరుజిల్లా ముత్తుకూరు హైస్కూల్ ప్రధాన పండితులును, వి
ఘోషణ గురుబ్రహ్మస్తవేత్యాద్యనేకకృతికర్తలును, ఉభయ కవితాప్రవీణ, సాహిత్యవిశార
వైద్యరత్నేత్యాది బిరుదాలంకారులగు బ్రహ్మశ్రీ ఆకిలి శ్రీరామశర్మగారికిని నా కృత
వందనములర్పించుటయకాక—

ఇచ్ఛాపురోన్నత పాఠశాలా ప్రధానపండితులును విద్వాన్, వైద్యవిద్వాన్ పట్టభద్రుల
సరసకవితాధౌరేయులై రఘు చరితేత్యాది కృతికర్తలగు శ్రీ. చి॥ కట్టి వెంకటసుబ్బరాయశ
గారికి నానిరంతర శుభాశాసనముల నిడుచున్నాను.

మఱియు, నాగ్రంథరచనప్రియత్నములందెల్ల వలయు గ్రంథసామగ్రినిడి గౌరవి
నాపుందోడుపడినట్టియు, కులక్రమాగత శ్రీమాతృసేవా దీక్షితులును, అరసవల్లి గ్రామవా
లును, తత్ప్రసిద్ధ శ్రీసూర్యనారాయణ దేవాలయ ధర్మకర్తలునైన, శ్రీ॥ ఓ॥ ఇప్పిలి వేం
రామశర్మగారికి నానిరంతర మంగళాశాసనముల నిడుచున్నాడను.

తద్విద్యాసంపన్నులగు పండితసామాజికులు నానెరసులను జూపి మేలొనర్చిన
గృతజ్ఞుఁడనై ముందుకూర్పున సవరించుకొందును.

## —* పుణ్యాత్ములగు చదువరులకు విజ్ఞప్తి. *—

ఉదారమతులగు ధన్యులు ప్రచురించిన నా "బాలాంబికాశతకము, సౌందరలహర
వాదము" భక్తులకుచితముగానే యందీయఁగల్గితిని. వాని ప్రతులు నిండుకొన్నవి. గాన
బుద్ధులెవరేని వానిఁబునర్ముద్రణముచేయించి నిరపేక్షతో భక్తులకిచ్చి భగవతీకృప నార్జింపఁ
నపుడు వందనములతో వారికిఁబునర్ముద్రణాధికారమునిచ్చెదను.

శ్రీధర్మద్య వైద్యశాల
శ్రీకాకుళము.
తే 1-9-1951ది

ఇట్లు, భక్తపాదరేణువు.
శ్రీ శ్రీయానందనాథాపరనాముఁడు
ఈ శ్వ ర స త్య నా రా య ణ శ ర్మ

# శ్రీ సౌభాగ్యవిద్యాహృదయము

ఓం. స్తుమః పుంవత్కారం కించిదరుణం తరుణీమయం
కలాపంచదశారబ్ధం కమనీయం పరం మహః
తన్మహః పరమం నౌమి కృత్యైః పంచభిరంకితం
అశేషవిశ్వభేదాత్మపూర్ణానందాత్మకం శివం
త్రిధా విభక్తం యద్వస్తు స్తోతృస్తుత్యస్తుతిక్రమాత్
ఏకస్మై మహసే తస్మై నమః సకలచక్షుషే
స్మరామి తాం పరాం వాచం పశ్యంత్యాదిక్రమాశ్రియాం
నానావిధమహాకారరసానుభవకారణాం
దేశకాలపదార్థాత్మా యద్యద్వస్తు యథా యథా
తత్తద్రూపేణ యా భాతి తాం శ్రియేహం విభోః కలాం
మూలాదిబిలపర్యంతం మహాత్రిపురసుందరీం
యాతనుస్తే తటిత్ప్రఖ్యా తాం భజే భవనాశినీం
యోనౌ కనకపుంజాభం హృది విద్యుచ్చయోజ్జ్వలం
ఆజ్ఞాయాం చంద్రసంకాశం మహస్తవ మహేశ్వరి
ప్రసృతామృతరత్నౌఘసంతర్పితచరాచరాం
భవాని భవశాంత్యై త్వాం భావయామ్యమృతేశ్వరి
వర్ణః కలా పదం తత్త్వం మంత్రో భువనమేవ చ
ఇత్యధ్వషట్కం దేవేశి భాతి త్వయి చిదాత్మని
అనాశ్రితాదికాలాగ్నిరుద్రాంతం చిత్రమద్భుతం
ఉన్మీలయసి మాతస్త్వం ప్రకాశవపుషి త్వయి
యదిదం భాసతే దేవి నామరూపక్రియాత్మకం
ప్రకాశవపుషస్తత్తత్సర్వం నాతికరిష్యతి
నేత్రాదిజాలకోపాంతే హృత్పాదాసనలీలయా
వారం వారం త్వయా దేవి రూపాదిమధు సేవ్యతే
సంవిద్దేవ్యః సమాక్రమ్య విషయానమృతాసవం
యోగినాం ప్రేషయంత్యార్యే త్వత్పూజార్థం హి సర్వదా
సౌభాగ్యహృదయం గుహ్యం శివానందేన యోగినా
సమారాధనపూర్త్యర్థం స్తుతం సకలకామదం॥

— * —

నెల్లూరుజిల్లా ముత్తుకూరు హైస్కూల్ ప్రధానపండితులును
విజయఘోషణ గురుబ్రహ్మాస్త్రవేత్త్యాది బహుగ్రంథ
కర్తలును ఉభయకవితాప్రవీణ వైద్యరత్న
విశారదేత్యాది బిరుదాంకితులును అగు
బ్రహ్మశ్రీ ఆకిలి శ్రీరామశర్మగారి

# అనుశీలనము

ఉ॥ ప్రాయము వ్రాలియున్ గవనబంధము వ్రాలని బంధురోక్తిసు
శ్రీ యెసలారఁదెన్గొనరిచెన్ స్తవపంచక మల్ల కాళిదా
సీయము నే యశస్వి, బుధశేఖరుఁగొల్చెద నట్టి సత్యనా
రాయణ శర్మ, దీక్షితమహాశయు నీశ్వరవంశపావనున్.

శ్రీశర్మగారు పంపిన దేవీపంచస్తవిని ఆమూలచూడము తిలకించితిని. అందలి కవితా స్వారస్యసౌరస్యముల నారఁగ్రోలి పులకించితిని.

బాల్యమాది కవితాపథపథికులై నిశ్శంకకీర్తిఘంటాపథిరథికులైనట్టి వీరిరచనలకును ఒరుల సమ్మతులు గావలయునో!

అయినను నాకుఁదోఁచినవి యొండు రెండు పాఠకులకు మనవి చేయుచున్నాను. వీరి యనువాదము శ్రీనాథభట్టు నుడివినట్టు "ఆశేషమనీషి హృదయంగమంబుగా, శబ్దంబనుసరించియు నభిప్రాయంబు గుఱించియు, రసంబు పోషించియు, అనౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారిగా"నున్నదని ముమ్మాటికి నానమ్మకము.

నిజముగా వేఱుబాస నున్నదానిని మాఱుబాసకు సంతరించుచో, ఉన్నదున్నట్లు — అక్షరాక్షరమనువదించిన రుచింపదనుట సర్వవిదితమే గదా! అందును బద్యబద్ధమగునేని, యథామాతృకానువాదము బొత్తుగ నింపిలదు. ఒక బాసలోని నుడికారము మఱియొక బాసకు అందగింపదు. అట్టియెడ"మక్కికి మక్కి"యెట్లు పొందుపడఁగలదు?

పైని జెప్పిన శ్రీనాథుని పలుకుబడిని - వీరి గ్రంథమున శబ్దంబనుసరించిన పట్లు, అభిప్రాయంబు గుఱించిన చోటులు, రసంబు పోషించిన యెడలు, నీరసంబు త్యజించిన కడలు• దలస్పర్శముగఁజూపినచో నీగ్రంథప్రాశస్త్యమెట్టిదో తెలియఁగలదు చూడుఁడు.

"ఐంద్రస్యేవ శరాసనస్య దధతీ మధ్యేలలాటం ప్రభాం
శౌక్లీం కాంతి మనుష్ణగోరివ శిరస్యాతన్వతీ సర్వతః
ఏషాసౌ త్రిపురా .........

సీ॥ ఐంద్రమైన ధనుస్సునందలి ప్రభఁబోలి
మలయు నేయమ ఫాలమధ్యమందు;
శాక్లీందువిశదతేజస్సమద్యుతుల నే
యమ్మ పైకొనునొ శిరమ్మునందు,
ఏమె సౌరప్రభ కెనయైన దీప్తుల
నెలయించుఁదా నిల్చి హృదయమందు;"

పైశ్లోకపుటనువాదము క్రింది సీసపద్యము. ఇందు బాలామంత్రబీజములు పాదానుక్రమముగ మొదలి పాదమున మొదలిదియు, రెండవపాదమున రెండవదియు, మూడవ దాన మూడవదియు మూలమున అనుబద్ధమై యున్నవి. వీరి యనువాదములో ముఖ్యమగు నీక్రమము కడు సుందరముగ ననుసంధింపఁబడినది. ద్వితీయమగు క్లీం బీజము చెప్పుటలో మూలకారుఁడు ద్వితీయాంతమగు కాంతికి విశేషణముగ స్త్రీలింగమున శాక్లీం అనిసుబంధముగ దాఁటుకొన్నాఁడు. అది తెలుఁగునకు మార్చుటలోని కష్టము గుర్తించి వీరు భంగ్యంతరముగ "శాక్లీందు"అని సమాసగతము చేసి క్లీం అను బిందుసహితరూపమును జాల యుపజ్ఞతతోఁ బ్రయోగించియున్నారు. మఱియు మూలమున సౌః అను బీజము పూర్ణరూపమునఁ బ్రదర్శింపఁబడలేదు. వీరో: "ఏమె సౌరప్రభ" యనుచోట సౌపక్కుటి రేఫచే సౌః అను విసర్గసహితరూపమును మూలముకన్న సమర్థముగ సూచించియున్నారు. ఇది శబ్దంబనుసరించుటకు ఉదాహరణైకదేశము.

2. "దృష్ట్వా సంభ్రమకారి వస్తు సహసా ఐఐ ఇతి వ్యాహృతం
యేనాకూతవశాదపీహ వరదే బిందుం వినాప్యక్షరం"

ఉ॥ భీయుతివో తలంపుననొ వింతనొ మానవుఁడెవ్వఁడేని ఐ
ఐ యని బిందువున్విడిచి యన్న"

పైశ్లోకమున సంభ్రమకారి వస్తువును జూచి ఐఐ యని పల్కుట చెప్పఁబడినది. అనువాదమున సంభ్రమకారి యను పదమునందలి యభిప్రాయమును గైకొని భీతియు—తలఁపు—వింతయను తద్గర్భితములగు మూఁడు భావనలు వీరిచే నూహింపఁబడి వివరింపఁబడినవి. ఐఐ యను పలవరింత సంభ్రమకారివస్తుదర్శనముననే కలుగును. సంతోషకారివస్తుదర్శనమునను దుఃఖకారివస్తుదర్శనమునను, "అహా — అక్కట"లు బయలుదేరును. కావుననే వీరు భీతి తలంపు – వింత – అను సంభ్రమాంతర్భూతములనే వాడి లోకజ్ఞతతోఁబాటు అభిప్రాయము గుఱించుటకుఁగొంచొక తారకాణ వెలయించిరి.

3. "ఏతం కిన్ను దృశా పిబామ్యుత విశామ్యస్యాంగమంగైర్నిజైః
కిం వాముం నిగరామ్యనేన సహసా కిం వైకతామాశ్రియే."
"కనులం జుఱ్ఱుదునా, కవుంగిటను బిగ్గంజేర్తునా బల్మిఁదా
ర్కొనునా, యొక్కట నెత్తి పట్టుకొననా, కొంకేల ?"

పైశ్లోకానువాదము పరమాద్భుతము "దృశా పిబామి"అనుటకు — కనులం జుఱ్ఱుదునా యని యనుట అద్భుతరసాహము, కనులంద్రావుదునా ప్రభృత్యనువాదము జఘన్యము."విశామ్య స్యాంగమంగైర్నిజైః" అనుటకు — కవుంగిటను బిగ్గంజేర్తునా — అని యనువదించుట లలిత శృంగారరచనకు మచ్చు.తునుక "కిం వామునం నిగిరామి"అనుటకు — దిల్మిఁదార్కొనునా — అని యనుట స్త్రీవాంఛకనుకూలము. మూలమునకు మెఱుఁగు దిద్దుటయును. "కింవైశితామాశ్రయే" అను మూలములోని "అంగైర్నిజైరస్యాంగమురు విశామి"అని యనుటపుఁబునరుక్తముగాఁదోఁచు చున్నది. దానిని"ఒక్కట నెత్తి పట్టుకొనునా" యని తెలిఁగించుట స్త్రీల యుత్తరభావావేగమునకు అనుకూలముగను మూలపునరుక్తిని సరి దిద్దు నదిగ నున్నది. పైని"కొంతేల"యను కొసరు (అమూల్యకమయ్యు)స్త్రీసాహసమును ఘంటాఘోషమునఁదెలుపుటు చేయునదిగా నుండి కాముకుల హృదయంపుఁగ్రిమపరిణామవృష్టతలఁదెల్పునదిగా మకుటపాయ్రముగ నున్నది. రసంబు పోషించుట యన నిట్టిదే కదా!

4. "అజ్ఞానంతో యాంతి క్షయమవశమన్యోన్యకలహై  
రమీ మాయా గ్రంథౌ తవ పరిలుఠంతః సమయినః"

"మాయాగ్రింథిని జిక్కి విప్పుకొను సామర్థ్యంబు లేకజ్ఞులై  
హేయాన్యోన్యవివాదులై సమయులే యేఁజెల్లఁగోల్పోదురో తాయీ!"

పైశ్లోకమునకు, "నీమాయాగ్రింథిభేదనమెఱుఁగక పరస్పరము కలహించుకొని సమయా చారులు నశించుచున్నారు". అను నర్థము మాత్రమే యేర్పడుచున్నది, అనువాదమున'సమయులే కోల్పోదురు'అని విశేషించి 'సమయినః' అనుదానికి ఏవార్థము చేర్చి "కొంత సంగతిసందర్భము లెటిఁగి యామార్గమునందె సంచరించు సమయాచారులే తెలియరనఁగా ఇతరుల విషయము చెప్పవలయునా"యనునర్థముతోఁచి మూలమునఁగన్పడు ననౌచిత్యము పరిహరింపఁబడినది ఇట్లే పెక్కుచోట్ల సూక్ష్మేక్షికతోఁగనుఁగొను వారికి అను వాదమునందలి మెలఁకువలు మెఱుఁగులు కనుదగులఁగలవు. ఇట్టి విశేషములతోఁగూడియు నీయనువాదము మాతృకానుసారిగ నన్యూనాతిరిక్తముగ, రసవటిష్ఠముగ నున్నది.

5. "దగ్ధం యదా మదనమేక మనేకధా తే  
ముగ్ధః కటాక్షవిధిరంకురయాంచకార.  
దత్తే తదా ప్రభృతి దేవి లలాటనేత్రం  
సత్యం హ్రియైవ ముకుళీకృతమిందుమౌళేః॥"

"కాలిపోయిన మదను నొక్కనినె నీదు  
కల్కికేర్గన్నునేకుల గాఁగ మొల్పఁ  
జేసినది గోలె, నెలతాల్పు సిగ్గునఁదన  
నెన్నొసటి యగ్గికన్మూసికొన్నవాఁడు."

పైశ్లోకానువాదము వీసమంతయు వాసి వోక అచ్చు గుద్దినట్లు ప్రత్యంతరముఁబలె చె- చక్కని మాతృకానుసారిరచనయో చూడుఁడు.

మాతృకానుసారియను కొందొక గజిబిజి వ్రాఁతవలెఁగాక అర్థవ్యక్తికనుకూల- పదబంధములతోఁదెనుఁగుఁదనంపుటందంపుఁబొందికలలో నొప్పు నిట్టి రచనలే శాశ్వతిక- వెలరారఁగలవు అశేషమనీషిహృదయంగమములన నిట్టివే. వీరు తమ పీఠికయందుఁగాళిదాసు- ఆతని రచనలఁబట్టి యూహించిన సద్గుణసంపత్తి సర్వస్వము వీరి యందును వీరిరచనలయం- గనుగొనఁగల్గినాఁడను.

వీరి మున్నుడిపరికింపఁగా - వీరు దేవీపారమ్యమును దెల్పుటయందును "శ్రీగురుః స- కారణభూతా శక్తిః" అను విషయముఁబ్రతిపాదించు నపుడు, కుండలిన్యుపాసనానుభవ- వ్యక్తీకరించుపట్ల, "శివోహం - తత్త్వమసీత్యాది వాక్యములు నుడువుటందును, నైచ్యానుసంధాన- చేయునప్పుడును, భక్తివైరాగ్యతీవ్రతల నుగ్గడించునెడను సోహం, సాహమ్మను నైక్యభావ- వెలార్చునపుడును, సానుతాపప్రార్థనమున, శివశక్త్యభేదము తెల్పుచోట, జగదంబకడఁజన- చూపునెడను నిరాడంబరయథార్థోపాసకులుగా, పాదుకాంతదీక్షదక్షులుగా శక్తిపాతప్రసాదలగ- ద్దిధర్షువులుగా నామనోనేత్రమునకు గోచరించుచున్నారు.

వీరి పీఠికలోని వాక్యములలోనే వీరినుగ్గడించుట అంతకన్న నెఱి గల్గుపల్కులు మనసు- గుఱిపడనందుననే. ఇట్టిసేఁతలే, "స్వకీయాంబువులచే సలిలనిధికి సౌహిత్యమును గూర్చుట" యని పెద్దలు పేర్కొనిరి.

మఱియు వీరు స్వతంత్రముగ నచ్చతెనుఁగుపదముల సమాసములు రచనలందు విరివి- వాడియున్నారు. ఇందు వీరి మార్గమన్యదుర్లభము.' మెచ్చుచెట్లు, గొబ్బగీములు. అజ్జతమ్మిదుమ్ము- జిడ్డుకార్చెఁకు. పూగుదులు, చవివాఁకలు' మున్నగు సమాసములు సంస్కృతసమాసములకు సరియగు ననువాదములై స్వోపజ్ఞములై వినువారి మదుల ముదము గుదిగొనఁజేయుచున్నవి. 'స్రివదవటోధశర్మసుధ' మున్నగు సంస్కృతసమాసములను అనువాదములని లోపింప- సొంతములవలెనే తోషముంగూర్చుచున్నవి.

వీరి మున్నుడిలో నెన్నియో అమూల్యములగు విషయములు తెల్పి యున్నారు. అం- సరిక్రొత్త విషయములను గలవు. స్త్రీల తలతొడవుల విషయమై వీరు తెల్పిన యద్భుతావహ- విషయము ఎల్లరకును స్మర్తవ్యమును మంతవ్యమునునై యున్నదనుట నిశ్చయము. మున్ను- యందు సూచనాప్రాయముగఁబడవిన — గాయత్రీ పంచముఖదశకరరహస్యము, మంత్రాక్ష- రహస్యము — శ్రీసూక్తరహస్యార్థము, లోనగు విషయములు సవిమర్శముగఁద్వరలో లోకము- నకుఁబ్రసాదించి భౌతికవాదాంధీభూతమైన యీ లోకమునకు ఆస్తిక్యతాలోకము నొసం- యనుగ్రహింపఁగలరని వేఁడువాఁడను.

ముత్తుకూరు
నెల్లూరు జిల్లా
18-8-51

ఇట్లు,
ఆకిలి శ్రీరామశర్మ

గుంటూరునివాసులును, శ్రీకృష్ణతులాభారాద్యనేక యక్షగాన ప్రబంధ రచయితలును, శ్రీ సౌందర్యలహర్యనువక్తలునగు బ్రహ్మశ్రీ మద్దూరి సాంబయ్యకవిగారి యభిప్రాయము.

శ్రీమత్పరమేశ్వర్యైనమః

# ఉత్పలమాల

శ్రీయుత! ఈశ్వరాన్వయ సరిత్పతిపార్వణసోమ! సత్యనా
రాయణశర్మ నామ! త్రిపురాపద పంకజభృంగ! బ్రహ్మవి
ద్యాయతనాంతరంగ! కవితానవ తామరసార్చితాంబికా!
నా యభివాదముల్గొని యనంతర మీయది చిత్తగింపుమీ;
నాయెడ నెంతయేని కరుణాదమరంపిన పూజ్యకాళిదా
సీయ పరాంబికాస్తుతికిఁ జేసిన మీ యనువాదపద్యముల్
నాయెడ కింత యంత యనరాని ప్రమోదముఁ గూర్చె; మూలమం
దేయడ నేవిశేషము లవెట్టివి రాజిలు శైలిలోన, నే
తీయఁదనంబు వొల్చు నవి తీరిచి దిద్దిన యట్లు సర్వమున్
మీయనువాదపద్యముల నిద్దపుటద్దములోపలంబ్రతి
చ్ఛాయ విధానఁ గన్పడెడి; సత్కవిమండన! మేలు మేల్భళీ!
మాయురె! యంచుఁ బండితసమాజము నిన్ను నుతించు; నైననే
నీయది నీకు శక్తి యని యెంచ; మహేశున నాపరాంబయే
నీయెడఁ దగ వసించి, రమణీయతరాక్షరరూపమంది, నిన్
వ్రాయుమటన్న వ్రాసితివి; వాస్తవ; మాయమ కూర్మి బిడ్డపై
రేయివగల్లఁ దప్పద జలేరుహ సన్నిధి నుండు, నీకిఁ గన్
జేయు నసాధ్యమెయ్యది? విచిత్రముగా నొక మూఁగమానిసిన్
స్వీయకటాక్షవీక్షణముచే నిముసాన మహాకవీంద్రునిన్
జేయదె యాజగజ్జనని? శ్రీపరమేశ్వరి, యాదిశక్తి దీ
ర్ఘాయు రనామయత్వధిషణాఢ్యుని నిన్ బొనరించి యిట్టివే
వ్రాయఁగఁ జేయుఁగాత మనవద్యకృతుల్ మఱి కొన్ని; సర్వని
శ్రేయసకారుఁ డౌచు విలసిల్లనుగా కవి; తెల్గుబాస గై
సేయను గాత వాని వరశీర్షమునన్ రవణంబులట్లు; కా
త్యాయని భక్తి లోకమున వ్యాప్తి వహించి జయించుఁగావుతన్.

గుంటూరు
17—7—1951

ఇట్లు విధేయుఁడు
మద్దూరి సాంబయ్య

విద్వాన్, వైద్యవిద్వాన్, పట్టభద్రులును, ఇచ్ఛాపురోన్నతపాఠశాలా
ప్రధాన పండితులు సరసకవితాధురీణులగు, బ్రహ్మశ్రీ
కట్టి వెంకట సుబ్బారాయ శాస్త్రి గారి

# ★ అభిప్రాయము ★

శ్రీమాత్రే నమః. శ్రీమద్గురుభ్యో నమః

మహాకవి కాళిదాసుఁడు శ్రీమాత నారాధించి యనన్యసామాన్యశేముషీధురంధరుఁడై శ్రీదేవీ కటాక్షవిర్భూత కవితాప్రవాహమున సర్వప్రపంచము నాప్లావితమొనర్చి యారాధ్య దేవతామహిమ నుగ్గడించుచు ఉపాసనాపరుల నుద్ధరింపఁజేయుటకై స్వానుభవబోధకమును మంత్రప్రాయమునగు శ్రీదేవీపంచస్తవి నొనర్చి విశ్వోపకృతి నొనర్చెను.

అస్మద్గురువర్యులగు బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు సద్గురుసమాప్త శ్రీవిద్యారహస్యవిశేషులై పూర్ణాభిషిక్తులై యపూర్వసాధనామహిమాతిశయమున లోకోపకార మొనర్చుచు, అసమాన శ్రీమాతృపాదారవిందభక్తి ప్రేరితులై శ్రీబాలాంబికా శతకము, శంకర గురుకృతమగు సౌందర్యలహరి కాంధ్రానువాదము మున్నగునవి చేయుటే కాక యిపుడీ శ్రీకాళిదాస పంచస్తవికిఁ "తెనుఁగు సేఁత"యొనర్చి యాంధ్రలోకమునకు మహోపకృతి నొనర్చిరి. ఇట్టి యుత్తమకార్యనిర్వహణము శ్రీదేవీకరుణాకటాక్షమాత్రసాధ్యము గాక యన్య మెట్లగును?

శ్రీవారి తెనుఁగు సేఁత యొక్కచో అన్యూనాతిరిక్తమై యలరారుచు, ఒక్కొకచో మూలమునకు వివరణప్రాయమై నిగూఢరహస్యముల వెలువరించుచు వేఱొకచో ముద్దు మూటగట్టు జానుతెనుఁగు నుడికారముల సొంపు నింపుచు ద్రాక్షాపాకమున నొప్పి యమృత గుళికవలె సర్వదాస్వాద్యయోగ్యమై యున్నది. భోగమోక్షప్రదమగు నిట్టి శ్రీవిద్యోపాసన మార్గము నుమాటిమాటికిఁ బ్రదర్శించుచుఁ జిరవిస్మృత ప్రాచీన భారతజాతీయ బ్రహ్మవిద్యా మాహాత్మ్యము నుద్ఘోషించుచు సాధకలోకమందుఁగర్తవ్యదీక్షను బురికొల్పుచున్నారు ఇట్టి లోకోత్తరమహాపురుషులే గదా జగద్గురు పరంపర ననుగమించు సద్గురువర్యులు - ఇటులు వీరొనర్చునదియే కదా యధార్థమగు మాతృదేశోద్ధరణము ఇట్టివీరి యీదివ్యరచనము ఆంధ్రలోకమున మంత్రభూతమై శాశ్వతస్థితి నొందకుండునా?

అనువాదము సహజముగఁ గష్టతరసాధ్యము. అందెట్టి మహాకవులును స్వాతంత్ర్యమును గోల్పోక తీఱదు. శ్రీకాళిదాసరచనము అనువాదమున కసాధ్యమని జగత్ప్రసిద్ధము. అందు నిది బ్రహ్మవిద్యా మంత్రశాస్త్ర రహస్యగర్భము. ఐన నేమి? శ్రీమాతృకృపావలంబనమున

శ్రీవారి యమృతలేఖిని కృతార్థత నొందినది. భావప్రకటనావసరముల నేమాత్రముఁగుంఠితము గాక శ్రీవారిహృదయమువలెననువాదమును స్వేచ్ఛాస్వాతంత్ర్యములఁగోల్పోక స్వతంత్రరచనము వలె విలసిల్లుచున్నది. సంస్కృతమున శ్రీకాళిదాసుని కవితవలె, ఆంధ్రమున శ్రీవారిరచనము నిరర్గళగతిం బ్రవహించినది.

నిక్కముగ నియ్యది శాశ్వతమై విస్మృత ప్రాచీన భారతీయ ప్రతిభా పునర్నిర్మాణ దక్షమై జగదుపకారి యగుననియు, నిట్టి యుత్తమగ్రంథమును రచించిన శ్రీమద్గురువర్యులు నిశ్చయముగా జగదుద్ధారకులనియు శ్రీవారికిఁ బరిపూర్ణాయురారోగ్యముల నొసంగి, శ్రీమాత యింక నిట్టి లోకోపకారక గ్రంథములను రచియింపఁదగు మేధాదార్ఢ్యములను పెంపొందింప నాయమ్మకు మ్రొక్కి వేడుకొనుచున్నాను.

మఱియు నీగ్రంథమును బ్రకాశింపఁజేసిన బ్రహ్మశ్రీ శివానందము వీరయ్య దేవర గారు భక్తపండితవంద్యులు. శ్రీమాత గ్రంథకర్తను బోలి శ్రీవారిని గూడ ననుగ్రహించి వారి శైవ వైషదీక్షను బెంపొందించి యిట్టి సత్కృతులకే సతతాభిముఖులను జేయుఁగాతమని సకలజననిఁ బ్రార్థించుట నావిధిగా నెన్నుచున్నాఁడను. ఇచ్చట కర్తృప్రకాశకసంఘటనము శ్రీమాతృలీల శ్రీశివానందమహిమ యనుశీర్షికక్రిందఁ జదువఁ దెలియఁగలదు.

ఇట్లు,

విద్వాన్ కట్టి వెంకటసుబ్బారావు



# శ్రీమన్మహాకవి కాళిదాస నుతి

శా॥ సౌవర్ణాంచితమాలికాపరము ప్రాసాదమ్మునన్ సుందరీ
సేవానంతసుఖంబులొందనకళాశృంగారసంశ్లిష్టస
ద్భావుండై శ్రితచక్రిరక్షసమయోదారుండు వీరుండునై
భూవంద్యుండగు నీదు దాసు నెద సంపూజించెదన్; కాలికా!

చ॥ వదలని కావ్యపుష్పవనవాటులు నాటఁగఁ జేసి వానియం
దెడనెడ శైవధామముల నేకవితార్కికచక్రవర్తి చేఁ
బుడమి రహింపఁజేసి జనపూజ్యుని జేసితి వామహాత్ము నీ
యడియరి నీవుగాఁదలఁచి యర్చన చేసెదనమ్మ! కాలికా!

చ॥ సతతవిపక్వచిద్గగనచంద్రికయే తనువైన నిన్ జగ
ద్ధితకృతిరూపఁగా నిటఁజరింపఁగఁగట్టడ చేసి తత్సుకీ
ర్తితను వమర్త్యముంజలిపి దేవియె తానను వాసి గన్న పూ
జ్యతముఁడు కాళిదాసుఁడు నిరంతరవంద్యుఁడు మాకు భారతీ!

శా॥ "వాగర్థావివ" యన్న మంత్రితతి మీ పాల్సేసిలిన్ దేవభా
షాగంభీరమహాబ్ధి దాఁటుఁడని విశ్వశ్రేయముంగోరి యే
వాగప్రాప్యసుధీవిభాసుఁడొసఁగెన్ వానిన్ మహాభాగునిన్
ద్యాగిన్ భోగి విరాగి యోగి నెద సంధానింతు వాగీశ్వరీ!

శా॥ వాగర్థాకృతులైన యా శివులఁగొల్వన్ గాళిదాసుండు రా
వాగర్థాధ్యత నొందె నన్న నరరే! వైలక్ష్యమే తోఁచు; ఆ
వాగర్థాధ్యత నాకుఁబెట్టు మిఁక విశ్వత్వంబు లోఁపంగ. "నే
నే గా నీవన" నంచు ముమ్మరులు వాణీ! తన్వుమా వానినే.

మ॥ కలిదాసుండను; కాళిదాసుని మహాగంభీరవాగ్గుంభనల్
తెలుఁగుంజేసెద నన్న పెన్దెగులు గల్గెం గల్గెఁబో; కొన్ని వ్యా
ధులు పైకొన్నను మున్నె పైకొనిన వ్యాధుల్ డుల్చి నైరుజ్యమున్
బలముంగూర్చునటుల్ మదార్జితభవవ్యాధిం దొలంగింపదే?

శ్రీదేవీపంచస్తవ్యనువక్త,
శ్రీ శ్రియానందనాథాపరనాముఁడు,
ఈశ్వర సత్యనారాయణశర్మ.

—॥—

శ్రీమాత్రే నమః

శ్రీ మద్గురుభ్యో నమః

 

# కృతిసమర్పణము.



కం॥ శ్రీవిద్యాః పరమేశ్వరిః దేవీః విశ్వోద్భవస్థితిప్రలయకృతీః
భావజ్ఞః బ్రహ్మధర్మా! నావిన్నప మాలకించి నతులంగొమ్మా. 1

గీ॥ మహితనాగావళీ పశ్చిమతటమందుఁ
గ్రాలు గుజరాతుపేట రత్నాలమూట;
అందు ఘూర్జరవిప్రాన్వయము ద్వివేది
సంజ్ఞ నొప్పు నొకండు నిష్కలుషమగుచు. 2

శా॥ శాక్తాద్వైతము పుట్టినిల్లగుచు శ్రీచక్రార్చనశ్రద్ధ వి
ధ్యుక్తంబై కొనసాగు దేవళమునై యొప్పారు నవ్వంశ మా
ముక్తాఘంబనవేల? దానఁబొడమెఁగా బూతాత్ముఁడై భైరవీ
భక్తశ్రేష్ఠుఁడు రాజరామను సుధీవర్యుండు నాభిఖ్యుఁడై. 3

ఆ॥వె॥ వెలసె మంత్రిమూర్తి బిరుదంబు తోననఁ
బలుకనేల వాని భవ్యభక్తి.
లక్ష్మీపూజచేసి లలితగుణుండగు
తనయుఁగాంచి లక్ష్మీదత్తుఁడనియె. 4

సీ॥ పుట్టినాఁడొకమంత్రమూర్తిగర్భమున శ్రీ
విద్య యబ్బె నటన్న వింతయేమి?
ఎన్నికగను నొజ్జమిన్నగా మన్నాఁడు
విద్యాప్రదాత నావెఱఁగదేమి?
చదివినాఁడెన్నియో సత్తంత్రముల్ సంశ
యచ్ఛేది గురుఁడన నరిదియేమి?
ఎడలేని తపమాచరించినాఁడా దేవి
ప్రత్యక్షయన్న నబ్బరమదేమి?

తే॥గీ॥ శాక్తమంతస్సునంబైకి శైవమనెది
వినుతకౌలోపనిషదుక్తవిధినె నడచు
వాఁడతనిలోఁతు గన్నట్టివాఁడు లేఁడు
కన్నవారల కాతఁడు కన్నవాఁడు. 5

సీ॥ మెట్టపట్టియ మెట్ట పట్టుగా మనుచుండు
రట్టులేనట్టి పెరవు లెమెట్టి,
కట్టు బొట్టును జుట్టు పుట్టునకున్మొట్టు
పెట్టునట్టుండమి యొట్టు పట్టి,
బెట్టునుం దిట్టును న్మట్టని యట్టులే
నెట్టు మన్గద; విద్దె జట్టికేఁడు;
గొట్టుతట్టేగఁడు; గిట్టమి యెఱుఁగఁడు;
గుట్టుపట్టు; గొనాల పుట్టుపట్టు;

మట్టు మీఱఁడు పల్కున; దిట్టమిన్న;
వట్టిపోఁడెద్దడిఁగ; కల్మి మిట్టిపడఁడు;
అట్టె మట్టెను గింక మున్నైన తుట్టు;
లిట్టి గురు లక్ష్మీదత్తున కెవ్వఁడీఁడు; 6

ఉ॥ ఆయతసంప్రపూతహరితాన్వయు, నీశ్వరవంశ్యు, పత్యనా
రాయణపేరి నన్ను భవదంఘ్రిసన్నిధిఁజేర్చినట్టి వి
ద్యాయతు లక్ష్మీదత్తుని యెదం బరిపూర్ణకళాత్మవౌచు "అ
మ్మా"! యన 'ఓ' యటంచు గడె మాత్రము నిల్వుము విన్ము మత్కృతిన్. 7

సీ॥ చిననాఁడె తండ్రి పెట్టిన దక్షిణామూర్తి
మనుబీజ మదియె శ్రీమాతృవిద్యఁ
గొను కోర్కెయై మొల్వఁగని యిదె యదనంచు
నుపదేశమనెడి పూలోదక మిడి,
క్రమశిక్ష యనెడి మాడాకును హత్తించి,
పంచదశీమంటపమును గూర్చి,
పూచి పండుట చూచి పూర్ణదీక్ష నొసంగి,
వ్రతిజేసి యమ్మహావాక్యములిడి,

తే॥గీ॥ నను శ్రీయానందనాథనామునిగఁజేసి
నట్టి వానికి నీకు నాకెట్టి వేఱు
పాటు లేకుంటఁగందు నపర్ణతాప్తి
గురునకీకృతి నిచ్చి నిబ్బరపుబత్తి. 8

గీ॥ ఏది నాఋణమంచేని యెవనికీపు
పిన్నటం బాయిపెట్టి తావిశ్వవినుత
శంకరాచార్యకృతి నంద్రనరణి మార్చి
తల్లి! నీకిద లేదె సౌందర్యలహరి? 9

గీ॥ అమ్మ! మున్మాటికిగా "ద్వమేవాహ" మనుచుఁ
దనివి గూర్చితి వేనీదు దాసు నదికి
నమ్మహాకవికృతులు లభ్యాదులైన
నీదు పంచస్తవములు తెన్గించి యిదిగో. 10

కం॥ ఆనందమయమహావి
ద్యానందచ్ఛాత్రరత్నమౌ శ్రీశ్రీవి
ద్యానందనాథునకు నిపు
డానందముఁగూర్తుఁగృతిసమర్పణకృతిలోఁ. 11

కం॥ ఆశాదూరుండు చిదా
కాశజ్యోత్స్నాప్రసాదఘనసుఖియగు నా
దేశికు దయావలోకకు
లాశిషములె సంతతంబు నాశింతు నెదఁ. 12

కం॥ శ్రీవరివస్యామర్మవి
ధావిజ్ఞానదశితాఘః ధర్మాధర్మ
స్థావరమతిః గురువరః శ్రీ
శ్రీవిద్యానందనాథః చేకొనుము కృతిఁ. 13

ఉ॥ చూపునఁజూపు నిల్పి సుధసోనలు ప్రేపలఁజిమ్మ నాకమౌ
నీపరిపూతహస్తమును నెత్తిని బెట్టితి, వేమొ చేసి నీ
లోపలిదేదొ యీజడునిలో నమరించితి దీక్షనాఁడు; చే
చాఁపెద నేఁడు నాపరమసౌఖ్యమె వేడుచు; వాంఛ యంతియే. 14

గీ॥ మంత్రగురుదేవతాత్మైక్యమహితబోధ
పండునటు, లిఁక నొక తల్లిపాల యాస
యుండనటులు, పరానంద మొందునటులు
పరిణమించుతఁగృతిసమర్పణము గురుఁడః 15

గీ॥ నీపగిది శైవసంవిన్నిరూపణచణ
శిష్యసంతానమిల నవిచ్ఛిన్నమౌచుఁ
బ్రాకఁజేయుత శ్రీవిద్య; భరతభూమి
తొంటివైభవములఁ దులతూగుఁగాత. 16

గీ॥ శక్తిమచ్ఛక్తులకు భేదయుక్తిమాని
భవ్యమౌ సమయాచారపరతనుండు
వారలై కృతికష్టంబు నారయఁదగు
పుణ్యసుతులకు నా చిన్నిపూవు లిడుదు. 17

---

గీ॥ మూలమిడి తెన్గుఁజేఁతకుఁబ్రోత్సహించి
నట్టి శ్రీదేవ్యుపాసకుఁడరసవల్లి
వాసి గుణభాసి పెతవాసి వాసి మీఱఁ
గ్రిలు నిప్పిలి వేంకటరామ శర్మ. 18

శ్రీశర్మద వైద్యశాల
శ్రీకాకుళం
2–10–51

మహాకవి శ్రీకాళిదాసుని దేవీపంచస్తవికి ఆంధ్రానువక్త.
శ్రీ శ్రీయానందనాథపరనాముఁడు
శ్రీకాకుళవాసి
ఈశ్వర సత్యనారాయణ శర్మ.



( 1 )

# శ్రీ దేవీ లఘుస్తవము.

—: o :—

శ్లో. ఐంద్రస్యేవ శరాసనస్య దధతీ మధ్యేలలాటం ప్రభాం
శౌక్లీం కాంతిమనుష్ణగోరివ శిరస్యాతన్వతీ సర్వతః
ఏషాసౌ త్రిపురా హృది ద్యుతిరివోష్ణాంశోస్సదాహస్థితా
ఛింద్యాన్నస్సహసా పదైస్త్రిభిరఘం జ్యోతిర్మయీ వాఙ్మయీ. 1

సీ॥ ఐంద్రిమైన ధనస్సునందలి ప్రభఁబోలి
మలయు నేయమ ఫాలమధ్యమందు;
శౌక్లేందువిశదతేజస్సమద్యుతుల నే
యమ్మ పైకొనునో శిరమ్మునందు;
ఏమె సౌరప్రభ కెనయైనదీప్తుల
నెలయించుఁదా నిల్చి హృదయమందు;
అట్టితేజోవాక్కులాకారముగఁ బొల్చు
పరదేవి త్రిపురసుందరి మదంబ;
దీనఁ బ్రథమ ద్వితీయ తృతీయపాద
ములఁదొలిది రెండవదియును మూడవదియు
నై వరుసఁదోఁచు వర్ణత్రియమ్ముచేతఁ
దొలఁచుఁగావుత వడిగ మాకొల్లలనెల్ల. 1

శ్లో. యా మాత్రా త్రపుసీలతాతనులసత్తంతుస్థితిస్పర్ధినీ
వాగ్బీజే ప్రథమే స్థితా తవ సదా తాం మన్మహే తే వయమ్
శక్తిః కుణ్డలినీతి విశ్వజనని వ్యాపార బంధోద్యమాః
జ్ఞాత్వేత్థం న పునఃస్పృశన్తి జననీగర్భేర్భకత్వం నరాః. 2

మ॥ విలసద్యోగసముద్యతుండునరుఁడో విశ్వాంబ! యెద్దానిఁగుం
డలినీశక్తిగనెంచి మళ్ళి భువిఁబుట్టండట్టి వాగ్బీజమం
దలిదై సన్నని దోసతంతికెనయై దైవాఱు నీమంత్రమం
దలి "ఐ"కారము నాదిమాత్రి నెద సంధానింతు ప్రశాంతమున్. 2

శ్లో. దృష్ట్వా సంభ్రమకారి వస్తు సహసా ఐఐ ఇతి వ్యాహృతం
యేనాకూతవశాదపీహ వరదే బిందుం వినాప్యక్షరం
తస్యాపి ధ్రువమేవ దేవి తరసా జాతే తవానుగ్రహే
వాచస్సూక్తిసుధారసద్రవముచో నిర్యాన్తి వక్త్రాంబుజాత్.

ఉ॥ భీయుతినో తలంపుననొ వింతనొ మానవుఁడెవ్వఁడేని "ఐ
ఐ"యని బిందువున్విడిచి యన్నఁదదక్షరశక్తి యెట్టిదో
యాయతవాక్సుధాపగ తదాస్యజలేజమునుండి పాఱఁగాఁ
జేయుదువమ్మ! నీ కృపను జెంది విలంబము లేకయే; ఉమా! 3

శ్లో. యన్నిత్యే తవ కామరాజమపరం మన్త్రాక్షరం నిష్కలం
తత్సారస్వతమిత్యవైతి విరలః కశ్చిద్బుధశ్చేద్భువి
ఆఖ్యానం ప్రతిపర్వసత్యతపసో యత్కీర్తయంతో ద్విజాః
ప్రారంభే ప్రణవాస్పదప్రణయితాం నీత్వోచ్చరంతి స్ఫుటమ్. 4

ఉ॥ తల్లి! ద్వితీయమౌ మదనదైవతబీజమునందుఁగల్గు నా
హల్లుల డుల్చి "ఓంకృతి"ఁదదాదిని జేరిచి పర్వవేళలం
దెల్ల ద్విజుల్ స్ఫుటంబుగ జపింతురు; దానిని వాఙ్మయంబుగా
నెల్లరెఱుంగఁజాలరు త్వదీంకృతిరూపము నోసదాంతనా! 4

శ్లో. యత్సద్యోవచసాం ప్రవృత్తికరణే దృష్టప్రభావం బుధైః
తార్తీయం తదహం నమామి మనసా త్వద్బీజమిందుప్రభమ్
అస్త్యౌర్వోపి సరస్వతీమనుగతో జాడ్యాంబు విచ్ఛిత్తయే
గోశబ్దో గిరి వర్తతే సునియతం యోగం వినా సిద్ధిదః. 5

చ॥ నెలజిగిఁబోల్చి యప్పుడె యనింద్యకవిత్వ మొసంగు గొప్పతో
వెలసెడి నీ తృతీయమగు బీజము నే మనసార మ్రొక్కెదన్;
తొలఁచు సకారయుక్తి నది తోడనె జాడ్యము; నా విసర్గమున్
గలియకయున్న వాక్ప్రదము కాదె యొసఁగదె సర్వసిద్ధులున్. 5

శ్లో. ఏకైకం తవ దేవి బీజమనఘం సవ్యఞ్జనావ్యఞ్జనం
కూటస్థం యది వా పృథక్క్రమగతం యద్వాస్థితం వ్యుత్క్రమాత్
యం యం కామమపేక్ష్య యేన విధినా కేనాపి వా చింతితం
జప్తం వా సకలీకరోతి సతతం తం తం సమస్తం నృణామ్, 6

మ॥ పరినున్నన్విడిసన్సహల్లులగుచ్ఛున్భాసిల్లినన్మానిసన్
వరుసన్నిల్చినఁదప్పినన్మనువులో వర్ణంబు లొండొండుగాఁ
బరిపూ:ంబులు గాన నేవిధముగా భావించినన్నోట ను
చ్చరితంబైనను గోర్కిపంటలిడు నశ్రాంతంబు, బాలాంబికా! 6

శ్లో. వామే పుస్తకధారిణీమభయదాం సాక్షస్రజం దక్షిణే
భక్తేభ్యో వరదానపేశలకరాం కర్పూరకుందోజ్జ్వలామ్
ఉజ్జృంభాంబుజపత్రికాంతనయనస్నిగ్ధప్రభాలోకినీం
యే త్వామమ్బ న శీలయన్తి మనసా తేషాం కవిత్వం కుతః. 7

చ॥ ఎడమ నభీతిపుస్తకము వీవలఁదావదమిచ్చియావియున్
ముడివడు మెత్తకేశ్శమరి, మొల్లలఁగప్రిముఁబోలుడాలుతోఁ
గడు విడుతమ్మిపొల్పుగనుకచ్కులనిద్దపుఁజూపులొప్ప ని
న్నెడఁదఁదలంపనట్టి జడుఁడెట్లు కవీశ్వరుఁడౌను? భారతీ! 7

శ్లో. యే త్వాం పాండురపుండరీక పటల స్పష్టాభిరామప్రభాం
సించంతీమమృతద్రవైరివ శిరో ధ్యాయంతి మూర్ధ్ని స్థితామ్
అశ్రాన్తా వికటస్ఫుటాక్షరపదా నిర్యాతి వక్త్రాంబుజాత్
తేషాం భారతి భారతీ సురసరిత్కల్లోలలోలోర్మివత్. 8

చ॥ ఎవఁడు సితాంబుజాతరుచు లేసర నౌదల నిల్చి యంతటన్
జవులను జిల్కుదానవుగ, స్వాంతమునంగను వాని వక్త్రవా
ర్భవముననుండి భారతి యవారితవిస్ఫుటవాక్ప్రదాఢ్యయై
దివిజసరిత్తరంగములతీరునఁబాఱదె? భారతీ! సతీ! 8

శ్లో. యే సిందూరపరాగపుంజపిహితాం త్వత్తేజసా ద్యామిమామ్
ఉర్వీంచాపి విలీనయావకరసప్రస్తారమగ్నామివ
ధ్యాయన్తి క్షణమప్యనన్యమనసస్తేషామనఙ్గజ్వర
క్లాంతాస్త్రస్తకురంగశాబకదృశో వశ్యా భవంతి స్త్రియః. 9

చ॥ పుడమియు నింగి నీరుచులఁబ్రింగుచు లత్తుకనీటి వెల్లువన్
మడఁగినయట్లుఁ, జెంద్రిమదుమారము గ్రమ్మినటుల్ మనమ్మునన్
గడియ తలంచువారలకుఁగారె వశల్ వలవేఁకి ప్రాముఁగా
జడిసెడి కన్నెలేడికనుజగ్గులజవ్వనులెల్ల రమ్మరో! 9

శ్లో. చంచత్కాంచనకుండలాంగద ధరామాబద్ధకాంచీస్రజం
యే త్వాం చేతసి త్వద్గతే క్షణమపి ధ్యాయన్తి కృత్వా స్థిరమ్
తేషాంవేశ్మసువిభ్రమాదహరహఃస్ఫారీభవంత్యశ్చిరం
మాద్యత్కుంజరకర్ణతాలతరలాఃస్థైర్యం భజన్తే శ్రియః. 10

ఉ॥ మిన్నపసిండిపోగులును, మేలగు సందిటిదండకమ్మరుల్
చెన్నగు నిన్ను నొక్కఁగడె"శ్రీ"మ్మను బీజము చేర్చి శ్రద్ధతో
నెన్నెడివాని యింటను మదేభవరశ్రుతిచంచలాత్మలౌ
నన్నువలుండరే చిరమొయారములారఁగ సుస్థిరంబుగా. 10

శ్లో. ఆర్భట్యా శశిఖండమండనజటాజూటాం నృముండస్రజం
బంధూకప్రసవారుణాంబరధరాం ప్రేతాసనాధ్యాసినీం
త్వాం ధ్యాయంతి చతుర్భుజాం త్రినయనామాపీనతుంగస్తనీం
మధ్యే నిమ్నవళిత్రయాంకితతనుం త్వద్రూపసంవిత్తయే. 11

ఉ॥ బింకపుగబ్బిగుబ్బలును వేనలిచుట్టను జందురేకయున్
మంకెనవన్నె చీరయును, నాలుగు చేతులు, మూడు నొక్కులన్
బొంకపునడ్ముఁబుట్టెసరి పొల్పును, బీనుఁగుగద్దె, కంటిమి
చ్చంకనమైన నిన్దలఁతుమమ్మరొ! నీ కలరూపెఱుంగఁగా. 11

శ్లో: జాతోప్యల్పపరిచ్ఛదే క్షితిభుజాం సామాన్యమాత్రే కులే
నిశ్శేషావనిచక్రవర్తిపదవీం లబ్ధ్వా ప్రతాపోన్నతః
యద్విద్యాధరబృందవందితపదఃశ్రీవత్సరాజోభవత్
దేవి త్వచ్చరణాంబుజప్రణతిజః సోయం ప్రసాదోదయః. 12

శా॥ శ్రీవత్సప్రభుబల్గమెం?తతనిదౌ శ్రీయెంత? సామాన్యవం
శావిర్భావము కాదె? యెట్టులు ప్రతాపౌన్నత్యసంశోభియై
యావిద్యాధరవంద్యపాదుఁడగు చక్రాధీశుఁడే యయ్యె?శ్రీ
దేవీ! నీ చరణాబ్జసంప్రణతి కాచే కారణంబింతకున్. 12

శ్లో. చండిత్వచ్చరణాంబుజార్చనకృతే బిల్వీదలల్లుంఠన
త్రుట్యత్కంటకకోటిభిః పరిచయం యేషాం న జగ్ముః కరాః
తే దండాంకుశచక్రచాపకులిశశ్రీవత్సమత్స్యాంకితైః
జాయంతే పృథివీభుజః కథమివాంభోజప్రభైఃపాణిభిః. 13

చ॥ జనని! భవత్పదార్చనకుఁ జాలిన బిల్వదళాలు కోయుటన్
దునిఁగిన ముండ్లతోఁ బరిచితుల్గనవేరికరాలు, వార లే
యనుపునఁ బద్మకాంతిధనురంకుశచక్రఝుషాదులైన ల
క్షణముల నొప్పు హస్తముల క్ష్మాపతులై జనియింత్రు చండికా. 13

శ్లో. విప్రాః క్షోణిభుజో విశస్తదితరే క్షీరాజ్యమధ్వాసవైః
త్వాం దేవి త్రిపురే పరాపరమయీం సంతర్ప్య పూజావిధౌ
యాం యాం ప్రార్థయతే మనఃస్థిరధియాం తేషాం తఏవ ధ్రువం
తాం తాం సిద్ధిమవాప్నువంతి తరసా విఘ్నైరవిఘ్నీకృతాః. 14

మ॥ నిను భూదేవులు పాలతోడ, నృపతుల్నేతోడఁ గోమట్లు తే
నెను, శూద్రుల్ కలుతోడ, సద్దమెయిఁ దన్వింగూర్చుచుం బూజచే
సిన నెయ్యెయ్యవి కోర్కు లయ్యవి వెసన్జేకూఱు నిక్కంబుగా
నెనువెంటం ద్రిపురా! పరాపరమయీ! విశ్వేశి! నిర్విఘ్నతన్. 14

శ్లో. శబ్దానాం జననీ త్వమత్ర భువనే వాగ్వాదినీత్యుచ్యసే
త్వత్తః కేశవవాసవప్రభృతయో ప్యావిర్భవంతి స్ఫుటమ్
లీయంతే ఖలు యత్ర కల్పవిరమే బ్రహ్మాదయస్తేప్యమీ
సా త్వం కాచిదచింత్యరూపమహిమా శక్తిః పరా గీయసే. 15

మ॥ నిను వాగ్వాదినిగాఁ గఁ బల్కుదురుగా నిశ్శేషవాక్కారణా!
వనజాతేక్షణవాసవాదిజని నీవల్లంగదా; సంక్షయ
మ్మున బ్రహ్మాదులు లీను లెందగుదు రాబుద్ధీంద్రియాతీతరూ
ప, నమేయన్ శ్రుతులు గద్దించు. జగదంబా! నిన్పరాశక్తిగా. 15

శ్లో. దేవానాం త్రితయం త్రయీ హుతభుజాం శక్తిత్రయం త్రిస్వరాః
త్రైలోక్యం త్రిపదీ త్రిపుష్కలమథో త్రిబ్రహ్మ వర్ణాస్త్రయః
యత్కించిజ్జగతి త్రిధా నియమితం వస్తు త్రివర్గాత్మకం
తత్సర్వం త్రిపురేతి నామ భగవత్యన్వేతి తే తత్త్వతః. 16

మ॥ జననీ! మూర్తులు నగ్నులన్ జగములున్ శక్తుల్ మహావాక్యబో
ధనకౌమాటలు, తారబీజములు, వేదమ్ముల్ స్వరంబుల్ పవి
త్రనదుల్మున్నగ ధాత్రినైనది త్రివర్గంబంతవట్టన్వయిం
చును నీదౌ త్రిపురాఖ్యకే, మఱి రహించున్నీస్వరూపంబుగా. 16

శ్లో. లక్ష్మీం రాజకులే జయాం రణముఖే క్షేమంకరీమధ్వని
క్రవ్యాదద్విపసర్పభాజి శబరీం కాంతారదుర్గే గిరౌ
భూతప్రేతపిశాచజృంభకభయే స్మృత్వా మహాభైరవీం
వ్యామోహే త్రిపురాం తరంతి విపదస్తారాంచ తోయప్లవే. 17

చ॥ అని జయ, రాట్సభన్ రమను, నధ్వమునందున క్షేమదన్, ద్వీపా
హినరపలాశిదుర్గగిరి నేగెడుచో శబరిన్, బరేతభూ
తనికరభీతి భైరవిని, దారను నీరము దాటువేళ, మూ
ర్ఛనమునఁ జింతయుందుఁ ద్రిపురన్ దలపోసిన నాపదల్విడున్. 17

శ్లో. మాయా కుండలినీ క్రియా మధుమతీ కాళీ కలా మాలినీ
మాతంగీ విజయా జయా భగవతీ దేవీ శివా శాంభవీ
శక్తిః శంకరవల్లభా త్రినయనా వాగ్వాదినీ భైరవీ
హ్రీంకారీ త్రిపురా పరా పరమయీ మాతా కుమారీత్యసి. 18

గీ॥ భగవతి, విజయ, దేవి, శాంభవి, త్రిణయన,
మాయ, కుండలిని, త్రిపుర, మాలిని, శివ,
వల్లభ, కుమారి, శక్తి, వాగ్వాదిని, క్రియ,
కాళి, మాతంగి, హ్రీంకారి, కళ, పరమయి.
మాత, భైరవి, జయ, పర, మధుమతి, శివ,
యనెడి పేళ్లెల్ల నీకె చెల్లును, మదంబ!. 18

శ్లో. ఆ ఈ (?) పల్లవితైః పరస్పరయుతైర్ద్వి త్రిక్రమాద్యక్షరైః
కాద్యైః క్షాంతగతైః స్వరాదిభిరథ క్షాంతైశ్చ తైః సస్వరైః
నామాని త్రిపురే భవంతి ఖలు యాన్యత్యంతగుహ్యాని తే
తేభ్యో భైరవపత్ని వింశతిసహస్రేభ్యః పరేభ్యో నమః. 19

శా॥ ఆకారాదికపల్లవప్రతతిచే నన్యోన్యసంశ్లిష్టతన్
నై కాకారమునంది కాద్యమయి క్షాంతమ్మైన వర్ణాళిచే
లోకంబందుఁ ద్వదీయనామములు పొల్చున్నేనవేల్గోప్యమై
యా కల్యాణదనామకోటి కివె జోహారుల్మహాభైరవీ! 19

శ్లో. బోద్ధవ్యా నిపుణం బుధైః స్తుతిరియం కృత్వా మనస్తద్గతం
భారత్యాస్త్రిపురేత్యనన్యమనసా యత్రాద్యవృత్తైః స్ఫుటమ్
ఏకద్విత్రిపదక్రమేణ కథితస్తత్పాదసంఖ్యాక్షరై
ర్మంత్రోద్ధారవిధిర్విశేషసహితస్సత్సంప్రదాయాన్వితః 20

మ॥ తొలిపద్దెమ్మున మూడుపాదములయందున్ బాదసంఖ్యాక్షర
మ్ములుగా నీమనువర్ణముల్నిలిపితిన్ బోలంగ, సత్సంప్రదా
యలసద్రీతి విశేషముల్వెలయ; సంఖ్యావంతులిచ్చారతిన్
దెలియంగాఁదగుఁదల్లి! నీదయిన యీదివ్యస్తుతిన్ భారతీ! 20

శ్లో. సావద్యం నిరవద్యమస్తు యది వా కింవా నయా చింతయా
నూనం స్తోత్రమిదం పఠిష్యతి జనో యస్యాస్తి భక్తిస్త్వయి
సంచింత్యాపి లఘుత్వమాత్మని దృఢం సంజాయమానం హఠా
త్త్వద్భక్త్యా ముఖరీకృతేన రచితం యస్మాన్మయాపి ధ్రువమ్. 21

చ॥ తెలియుదు నాయశక్తతను దేవిగా! బాగుగ, నైన నీదు ప
జ్జలరుహభక్తి ప్రేరణము చల్వఁజిరంబును నిల్చునట్లుగాఁ
బలికితిఁగాన, లోపములు పాటిలె లేదను చింతయేల? ని
చ్చలముగ నీదు భక్తులిది సద్దమెయింబఠియింత్రు: భారతీ! 21

ఇది
మహాకవి శ్రీకాళిదాసుని దేవీ లఘుస్తవమునకు
శ్రీ క్రియానందనాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణ శర్మ తెనుఁగుఁజేఁత.



( 2 )

# శ్రీ దేవీచర్చాస్తవము.

—: ౦ :—

శ్లో. సౌందర్యవిభ్రమభువో భువనాధిపత్య
సంపత్తి కల్పతరవస్త్రిపురే జయంతి
ఏతే కవిత్వకుముదప్రకరావబోధ
పూర్ణేందవస్త్వయి జగజ్జనని ప్రణామాః. 1

గీ॥ పొల్పునకొయారమునకును బుట్టినిండ్లు
మేటి రాసిరులిచ్చెడి మెచ్చుచెట్లు,
కైఁతకల్వల విచ్చు రాకాశశులును
నగుచు నీకైన మామ్రొక్కులడరునమ్మ! 1

శ్లో. దేవి స్తుతివ్యతికరే కృతబుద్ధయస్తే
వాచస్పతిప్రభృతయోపి జడీభవంతి
తస్మాన్నిసర్గజడిమా కతమోహమత్ర
స్తోత్రం తవ త్రిపురతాపనపత్ని కర్తుమ్.

గీ॥ దేవి! నిన్ను నుతించుచో దివిజగురుఁడు
మున్నుగాఁగల విబుధులే మూఢులనఁగ
నోజతోనె జడుండ నీయుగ్గడింపు
చేయ నేనెంత? తిగపోఁబుదాయ జాయ! 2

శ్లో. మాతస్తథాపి భవతీం భవతీప్రతాప
విచ్ఛిత్తయే స్తుతిమహార్ణవకర్ణధారః
స్తోతుం భవాని స భవచ్చరణారవింద
భక్తిగ్రహః కిమపి మాం ముఖరీకరోతి. 3

గీ॥ అయినఁదల్లిని గొనియాడుమనుచు. వినుతి
వనధి దాటించు మాల్మి భవత్పదాబ్జ
భక్తియే జన్మతీవ్రతాపంబడఁపనె
యేదియో నాదునోటఁబల్కించునమ్మ! 3

శ్లో. సూతే జగంతి భవతీ భవతీ విభర్తి
జాగర్తి తత్క్షయకృతే భవతీ భవాని
మోహం భినత్తి భవతీ భవతీ రుణద్ధి
లీలాయితం జగతి చిత్రమిదం భవత్యాః. 4

గీ॥ ఈవె జగములు చేయుదు; వీవె కాతు;
వీవె త్రుంతువు; మోహంబు నెడపు దీవె;
ఒక్కొక్కప్పుడు మోహంబు నూడ్పకుందు
వమ్మ! యీ చిత్రకృతులు నీకాటలు కదె. 4

శ్లో. యస్మిన్మనాగపి నవాంబుజపత్రగౌరి
గౌరి ప్రసాదమధురాం దృశమాదధాసి
తస్మిన్నిరంతరమనంగశరప్రకీర్ణ
సీమంతినీనయనసంతతయః పతంతి. 5

గీ॥ కన్నెతామరగవరన గౌర! నీదు
గారమునఁ గమ్మనైన నిగా రవంత
పడిన నరుపయి మరుముల్కిబారుచేతఁ
జెదరు చెలుల నిగాలు వచ్చి పడుచుండు. 5

శ్లో. పృథ్వీభుజోప్యుదయనప్రభవస్య తస్య
విద్యాధరప్రణతిచుంబితపాదపీఠః
యచ్చక్రవర్తిపదవీప్రణయ స్స ఏష
త్వత్పాదపంకజరజః కణజః ప్రసాదః. 6

గీ॥ రాజమాతృఁడుదయన పుత్త్రకుఁడు వత్స
నృపతి, విద్యాధరనతిరక్షితపదాస
నంబయిన సార్వభౌమపదంబుఁ గొనుట
త్వత్పదాబ్జరజోలేశ దయయ కాదె. 6

శ్లో. కల్పద్రుమప్రసవకల్పితచిత్రపూజా
ముద్దీపితప్రియతమామదరక్తగీతిమ్
నిత్యం భవాని భవతీ ముపవీణయంతి
విద్యాధరాః కనకశైలగుహాగృహేషు. 7

గీ॥ ఈగి చెట్టుల పూలఁ బూజించి, కూర్చు
చెలులు మదకలగానమ్ము చేయఁ జేసి
నిన్ను విద్యాధరులు విపఞ్చికలఁ జేర్చి
పైఁడిమల గొబగీములఁ బాడుచుంద్రు. 7

శ్లో. త్వత్పాదపంకజరజః ప్రణిపాతపూతైః
పుణ్యైరనల్పమతిభిః కృతిభిః కవీంద్రైః
క్షీరక్షితిపాకరదుకూలహిమావదాతా
క్రైరప్యవాపి భువనత్రితయేపి కీర్తిః 8

గీ॥ జనని! నీయడుగుదమ్మిదుమ్మునకు మ్రొక్క
పున్నెమున ధన్యులై నుతబుద్ధులైన
కవులకే గాక యెవరికిఁగల్గెఁజెపుమ
పాల నెల మంచు వెలిపట్టుఁబోలు పేరు. 8

శ్లో. లక్ష్మీవశీకరణకర్మణి కామినీనా
మాకర్షణవ్యతికరేషు చ సిద్ధమంత్రః
నీరంధ్రమోహతిమిరచ్ఛిదురప్రదీపో
దేవి త్వదంఘ్రిజనితో జయతి ప్రసాదః 9

గీ॥ అమ్మ! నీయడుగులంగొల్వనైన నెనరు
సిరిని చెలులను లోఁబడఁజేయు సిద్ధ
మంత్రమును, జడ్డుకార్చిఁకు మాపు పెద్ద
దివ్వెయయి వెల్గుచున్నది దేవదేవి! 9

శ్లో. దేవి త్వదంఘ్రినఖరత్నభువో మయూఖాః
ప్రత్యుప్తమౌక్తికరుచో ముదముద్వహన్తి
సేవానతివ్యతికరే సురసుందరీణాం
సీమన్తసీమ్ని కుసుమస్తబకాయితం యైః 10

గీ॥ పూజవేళల వేల్పుఁబూఁబోండ్లు మ్రొక్క
నపుడు, పాపట పూగుదులైన నీదు
కాలిగోళ్ళను మణులనౌ కాంతు లచటఁ
దాచిన సుపాణులట్లు ముదంబు నించు. 10

శ్లో. మూర్ధ్ని స్ఫురత్తుహినదీధితికాన్తిదీప్తమ్
మధ్యేలలాట మమరాయుధరశ్మిచిత్రమ్
హృచ్చక్రచుంబి హుతభుక్కణికానుకారి
జ్యోతిర్యదేత దిదమంబ తవ స్వరూపమ్ 11

గీ॥ ఔదల న్వెన్నెలంబోలి, యాజ్ఞయందు
హరిధనుశ్చిత్రమై, యనాహతము నంటి
నిప్పుకణముల కుప్పయట్లొప్పు నేది
యమ్మ! యాతేజె నీ స్వరూపమ్ము మమ్ము 11

శ్లో. రూపం తవ స్ఫురితచంద్రమరీచిగౌరం
ఆలోకతే శిరసి వాగధిదైవతం యః
నిస్సీమసూక్తిరచనామృతనిర్ఝరస్య
తస్య ప్రసాదమధురాః ప్రసరన్తి వాచః 12

చ॥ నెలజిగిఁబోలి తెల్లనగు నీదు స్వరూపము వాణి గాఁగ నౌఁ
దలఁదిలకించు నేసరుఁడతండు భవత్కృప నెల్లలేని మే
ల్పలుకుల కూర్పుపేరి చవిపాఁకల కిమ్మగు; వాని నోట ని
ర్మలమగుచుం బ్రసాదమధురంబగు బాసలుఁ బాఱుచుండుఁగా. 12

శ్లో. సిందూరపాంసుపటలచ్ఛురితామివ ద్యాం
త్వత్తేజసా జతురసస్నపితామివోర్వీమ్
యః పశ్యతి క్షణమపి త్రిపురే విహాయ
వ్రీడాం మృడాని సుదృశస్తమనుద్రవన్తి 13

ఉ॥ మృడసతి! నీదు తేజమున మేదిని యెల్లను లక్కనీట, బ్రిం
గుడువడినట్టులున్ జదలు కుంకుమ దుమ్మున మున్గినట్టులున్
గడె తరవాయియే నెవఁడు కాంచునొ. చెప్పెడిదేమి? యయ్యరే!
బిడియము వీడి వాని వెనువెంటనె పాఱరె క్రాలుగంట్లుమా! 13

శ్లో. మాతర్ముహూర్తమపి యః స్మరతి స్వరూపం
లాక్షారసప్రసరతన్తునిభం భవత్యాః
ధ్యాయన్త్యనన్యమనస స్తమనంగతప్తాః
ప్రద్యుమ్నసీమ్ని సుభగత్వగుణం తరుణ్యః 14

గీ॥ ఓత్రిపుర! నీదు రూపు ముహూర్త మెవఁడు
లక్కతీగ విధానఁదలంచు వాని
మదనసుందరుఁగాగని యదియె వనిగ
నువిద లెంతురు వలతేని యుడుకు క్రమ్మి. 14

శ్లో. యోయం చకాస్తి గగనార్ణవరత్న మిన్దుః
యోయం సురాసురగురుః పురుషః పురాణః
యద్వామమర్ధ మిదమన్ధకసూదనస్య
దేవి త్వమేవ తదితి ప్రతిపాదయంతి 15

చ॥ గగనసముద్రరత్నమయి క్రాలెడి చంద్రుఁడితండు, దేవదై
త్యగణ గురూత్తముండు ప్రతనాత్ముఁడితండును, నంధకారిలో
సగమగు వామభాగమును సంశయ మింతయులేక నీవె చూ
భగవతి! తత్పదార్థమని వాకొను నో త్రిపురాంబ! రూఢిగా. 15

శ్లో. త్వద్రూప ముల్లసితదాడిమపుష్పరక్తం
ఉద్భావయే న్మదనదైవత మక్షరం యః
తం రూపహీనమపి మన్మథ నిర్విశేషం
ఆలోకయన్త్యురునితంబతటా స్తరుణ్యః 28

ఉ॥ అమ్మ! యనంగదైవతమహత్తరబీజము నేఁడు వీడుదా
నిమ్మ సుమమ్ములా గెఱుపు నెక్కొనను నిన్నుఁగ నెంచు, వాఁడు కా
నిమ్మ కురూపి, యాతని రతీశుగఁ జూతురవే. నితంబభా
రమ్ముల కొమ్మలెల్లఁ ద్రిపురా! పురమర్దన కామవర్ధనీ! 28

శ్లో. బ్రహ్మేంద్ర రుద్ర హరి చంద్ర సహస్రరశ్మి
స్కంద ద్విపానన హుతాశనవందితాయై
వాగీశ్వరి త్రిభువనేశ్వరి విశ్వమాతః
అంతర్బహిశ్చ కృతసంస్థితయే నమస్తే. 29

గీ॥ అజ హరి హర హరి రవి శశాంక వహ్ని
కరిముఖ స్కంద వంద్య! జగజ్జనిత్రి!
వెలిని లోపల నంతట న్వెలయు దేవి!
వాగధీశ్వరి! త్రిభువనేశ్వరి! జోహారు. 29

శ్లో. యః స్తోత్ర మేతదనువాసర మీశ్వరాయాః
శ్రేయస్కరం పఠతి వా యది వా శృణోతి
తస్యేప్సితం ఫలతి రాజభి రీడ్యతేసౌ
జాయేత స ప్రియతమో మదిరేక్షణానామ్. 30

గీ॥ ఈశ్వరీస్తవ మిది మేళ్ళ నెల్లఁ నిచ్చు
నిది, దినము వినువాఁడును జదువు వాఁడు
రాజనుతుఁడగు; బ్రియుఁడగుఁ గ్రాలుగంట్లః
కతని యిష్టఫలావాప్తి కడ్డు లేదు. 30

ఇ తి
శ్రీమహాకవి కాళిదాస కృత శ్రీ దేవీ చర్చాస్తవః

ఇది
మహాకవి శ్రీ కాళిదాసుని దేవీ చర్చాస్తవమునకు
శ్రీ శ్రియానంద నాథాపరనాముఁడు, ఈశ్వర సత్యనారాయణశర్మ
తెనుఁగుఁజేత.

—:o:—

శ్లో. ఉద్దామ కామ పరమార్థ సరోజఖండ
చండద్యుతిద్యుతి ముపాసిత షడ్వికారామ్
మోహద్విపేంద్ర కదనోద్యత బోధసింహ
లీలాగుహాం భగవతీం త్రిపురాం నమామి. 24

గీ॥ కామ మోక్షాబ్జతతి రవికాంతివియును,
షడ్వికారరహితవు. నజ్ఞానగజముఁ
గూల్చు సుజ్ఞానకేసరి గుహవునైన
భగవతీ! త్రిపురాంబికా! వందనములు. 24

శ్లో. గణేశ వటుక స్తుతా రతిసహాయ కామాన్వితా
స్మరారి వరవిష్టరా కుసుమబాణబాహైర్యుతా
అనంగకుసుమాదిభిః పరివృతా చ సిద్ధైస్త్రిభిః
కదంబవనమధ్యగా త్రిపురసుందరీ పాతు నః. 25

చ॥ కరిముఖ భైరవేద్య, రతికాయజసేవిత పార్శ్వభాగయున్
స్మరరిపుపీఠయున్, గుసుమసాయకసాయకయున్, త్రిసిద్ధసం
పరివృతయు న్ననంగకుసుమాముఖసేవితయున్, గదంబభా
సుర వనవాసయౌ త్రిపురసుందరి, సత్కృప మమ్ము నేలుతన్. 25

శ్లో. రుద్రాణీ విద్రుమమయీం ప్రతిమామివ త్వాం
యే చింతయంత్యరుణకాంతి మనన్యరూపామ్
తా నేత్య పక్ష్మలదృశః ప్రసభం భజంతే
కంఠావసక్త మృదుబాహులతా స్త్రరుణ్యః. 26

చ॥ పగడపుబొమ్మయ ట్లరుణభాసనుగా, నసమానరూపగా
నెగడెడి యట్లు నిన్గనెడి నిర్మలులన్. జిగిమీఱు తెప్పలం
దగు కనులారు జవ్వనులు. తద్ద జొరావరి చేసి, నెమ్మెడం
దగిలిచి బాహుకోమలలతల్ భజియింపరె? రుద్రభామినీ! 26

శ్లో. త్వద్రూపైకనిరూపణప్రణయితాబన్ధో దృశో స్త్వద్గుణ
గ్రామాకర్ణనరాగితా శ్రవణయో స్త్వత్సంస్మృతి శ్చేతసి
త్వత్పాదార్చనచాతురీ కరయుగే త్వత్కీర్తితం వాచి మే
కుత్రాపి త్వదుపాసన వ్యసనితా మే దేవి మా శామ్యతు. 27

చ॥ కనులను నిన్నె కాంచు తమి, కర్ణయుగంబున నీగుణావళిన్
వినియెడి వేడ్క, చిత్తమున నీస్మృతి, హస్తములం దృదంఘ్రిపూ
జనచతురత్వసంపద, రసజ్ఞను నీస్తుతి, యెప్డు నీయుపా
సనమున్నను నన్యాసయును జాఱనియట్టులు చూడు మమ్మరో! 27

శ్లో. త్వామైందవీమివ కలా మనుఫాలదేశం
ఉద్భాసితాంబరతలా మవలోకయన్తః
సద్యో భవాని సుధియః కవయో భవన్తి
త్వం భావనాహితధియాం కులకామధేనుః 20

గీ॥ చదలినంతయువెల్గించు చందురేకఁ
బోలినటు నిను నెవ్వఁడు ఫాలమందు
నరయు నాతఁడు కవియగు నపుడె కొల్వు
కాంద్ర వాకిట నిల్చెడి కామగవివి. 20

శ్లో. శర్వాణి సర్వజనవందిత పాదపద్మే
పద్మచ్ఛదద్యుతి విడంబిత నేత్రలక్ష్మి
నిష్పాపమూర్తి జనమానస రాజహంసి
హంసి త్వ మాపదమనేకవిధాం జనస్య. 21

గీ॥ అమ్మ! శర్వాణి! అఖిలవంద్యాంఘ్రిజలజ!
నీరభవపత్ర సమరుచినేత్రశోభ!
అనఘమానసచర రాజహంసి! నీవె
భక్తబహువిధకష్ట విధ్వంసకరివి. 21

శ్లో. ఉత్తప్తహేమరుచిరే త్రిపురే పునీహి
చేతశ్చిరంతన మఘౌఘవనం లునీహి
కారాగృహే నిగళబంధన యంత్రితస్య
త్వత్సంస్మృతౌ ఝడితి మే నిగళాస్త్రుటంతి. 22

చ॥ విను త్రిపురాంబికా! పుటము పెట్టిన బంగరుఁబోలుదాన! నా
మనమును శుద్ధముంజలుపుమా; చిరకాలమునాఁటి పాపపున్
వనమును జెండుమా; యిపుడు బందెను సంకెలకట్లనుంటి; ని 22
న్ననయము నెంచు నాగొలుసులమ్మ! తునుంగకయున్నె యింతలోన్

శ్లో. త్వాం వ్యాపినీతి సుమనా ఇతి కుండలీతి
త్వాం కామినీతి కమలేతి కలావతీతి
త్వాం మాలినీతి లలితేత్యపరాజితేతి
దేవి స్తువంతి విజయేతి జయే త్యుమేతి. 23

గీ॥ సుమన యని, యపరాజిత, కమల యనియు
లలిత యని, విజయ యని, కలావతి యని,
మాత! ఉమ యని, జయ యని, మాలిని యని
నిన్నె కుండలి యని, వ్యాపిని యని యెంత్రు. 23

# శ్రీ దేవీచర్చాస్తవము.

శ్లో. ఇచ్ఛానురూప మనురూపగుణప్రకర్షం
సంకర్షిణి త్వమభిమృష్య యదా బిభర్షి
జాయేత స త్రిభువనైక గురుస్తదానీం
దేవశ్శివోపి భువనత్రయసూత్రధారః. 16

గీ॥ చక్కనారసి యిచ్ఛమై సత్వముఖ్య
గుణవిభూతిని గొని నీవు కోరికొన్న
రూపు గొన్నప్డఖిలగురుండు శివుఁడు
తా భువననాటకపు సూత్రధారుఁడగును. 16

శ్లో. ధ్యాతాసి హైమవతి యేన హిమాంశురశ్మి
మాలామలద్యుతి రకల్మషమానసేన
తస్యావిలంబ మనవద్య మనన్తకల్పం
అల్పైర్దినైః సృజసి సుందరి వాగ్విలాసమ్ 17

గీ॥ చలిపుల కొమారి! చలివెల్గు వెల్గుఁబోలి
సొచ్ఛెమగు దానిగా నిన్ను శుద్ధమతిని
దలఁచువాని కపుడె ప్రశస్తము ననంత
కల్పమగు వాగ్విలాసముఁ గరుణ నిడుదు. 17

శ్లో. ఆధార మారుత నిరోధ వశేన యేషాం
సిందూరరంజిత సరోజ గుణానుకారి
దీప్తం హృది స్ఫురతి దేవి వపుస్త్వదీయం
ధ్యాయన్తి తానిహ సమీహిత సిద్ధసార్థాః. 18

గీ॥ మూలవాయువు నడ్డి, నీమూర్తి నెవ్వ
రెఱ్ఱతామరజిగి మీఱ నెంతు రెదల
నట్టివారల సేవింతు రఖిలజనులు
తమ సమీహితసిద్ధికై ధరణియందు. 18

శ్లో. యే చిన్తయన్త్యరుణ మండలమధ్యవర్తి
రూపం తవామ్బ నవయావకపంకపింగమ్
తేషాం సదైవ కుసుమాయుధ బాణభిన్న
వక్షస్థలా మృగదృశో వశగా భవన్తి. 19

గీ॥ క్రొత్తలత్తుకయడుసురంగునఁ జెలంగు
నిన్ను లేఁబ్రొద్దుబిల్లలో నిల్పి తలఁచు
నతని కగ్గము కారె మృగాక్షులెపుడుఁ
బంగరువిల్తునమ్ము వ్రక్కలగుదురు? 19

( 3 )

# శ్రీ దేవీషట్స్తవము.

—: ౦ :—

శ్లో. ఆనందమందర పురందర ముక్తమాల్యం
మౌళౌ హఠేన నిహితం మహిషాసురస్య
పాదాంబుజం భవతు మే విజయాయ మంజు
మంజీరశింజితమనోహర మంబికాయాః. 1

మ॥ ఎది పూదండలతోడ సౌఖ్యభరితుం డిందుఁడిందు పూజించె, నె
య్యది బల్మిన్ మహిషామరారి తలపై నట్టిట్టు మట్టాడె; నె
య్యది యందంబగు నందె చప్పుడులఁ దియ్యంబౌనొ; యయ్యంబికా
పదనీరేజమె మాకు గెల్పిడుత సర్వంబైన కార్యంబులన్. 1

శ్లో. దేవి త్ర్యంబకపత్ని పార్వతి సతి త్రైలోక్యమాతః శివే
శర్వాణి త్రిపురే మృడాని వరదే రుద్రాణి కాత్యాయని
భీమే భైరవి చండి శర్వరి కలే కాలక్షయే శూలిని
త్వత్పాదప్రణతా-ననన్యమనసః పర్యాకులా న్పాహి నః. 2

మ॥ సతి! కాత్యాయని! శర్వరీ! శివసతీ! చండీ! శివా! భీమ! పా
ర్వతి! కాలక్షయ! శూలినీ! త్రిపుర! రుద్రాణీ! మృడానీ! జగ
త్త్రితయాంబా! వరదాత్రి! భైరవి! కలా! దేవీ! పరివ్యస్తు నే
గతి రక్షింతొ యనన్యచిత్తుఁడ; నమస్కారంబు; రాజేశ్వరీ! 2

శ్లో. దేవి త్వాం సకృదేవ యః ప్రణమతి క్షోణీభృతస్తం నమ
న్త్యాజన్మస్ఫురదంఘ్రిపీఠవిలుఠత్కోటీరకోటిచ్ఛటాః
యస్త్వామర్చతి సోర్చ్యతే సురగణై ర్యఃస్తౌతి స స్తూయతే
యుస్త్వాం ధ్యాయతి తం స్మరార్తివిధురా ధ్యాయంతి వామభ్రువః. 3

చ॥ నిను నొకసారి మ్రొక్కునతనిన్ బదపీఠగమౌళికాంతులై
యనయము మ్రొక్కరే నృపతు; లామరపాళియుఁ గొల్చు నిన్నుఁ గొ
ల్చు నరుఁ నుతింతురి గాదె నిను స్తోత్రము చేసెడి వారి; నిన్దలం
పున ని[illegible]చే; 3

శ్లో. ఉన్మత్తా ఇవ సగ్రహా ఇవ విషవ్యాసక్తమూర్ఛా ఇవ
ప్రాప్తప్రౌఢమదా ఇవార్తివిరహగ్రస్తా ఇవార్తా ఇవ
యే ధ్యాయన్తి హి శైలరాజతనయాం ధన్యాస్త ఏవాగ్రతః
శ్యక్త్రోపాధివివృద్ధరాగమనసో ధ్యాయన్తి తాన్ సుభ్రువః 4

ఉ॥ రిమ్మయొ? గాలిసోకో? బలుతిక్కొ? విషార్తియొ? స్వాంగనావియో
గమ్మొ? యడావడో? పడుచుఁగాలపుమత్తొ? యనంగ నిన్ను ధ్యా
నమ్మొనరించు ధన్యులనె, నానయు జంకును వీడి లోన మే
ల్బొమ్మల కొమ్మలెంచుదురు మోహము పైకొన ప్రోలఁబార్వతీ! 4

శ్లో. ధ్యాయన్తి యేక్షణమపి త్రిపురే హృది త్వాం
లావణ్యయౌవనధనైరపి విప్రయుక్తాః
తే విస్ఫురంతి లలితాయతలోచనానాం
చిత్తైకభిత్తిలిఖితప్రతిమాః పుమాంసః. 5

గీ॥ నిన్నెడఁద భక్తితో గదె నిల్పువారు
జవ్వనము సౌరు నను సొమ్ము సడలియున్న
వారలే క్రాలుగంట్లకు భావభిత్తి
చిత్రితాకారులై ప్రకాశింతు రమ్మ! 5

శ్లో. ఏతం కిన్ను దృశా పిబామ్యుత విశామ్యస్యాంగ మంగైర్నిజైః
కింవాముం నిగరామ్యనేన సహసా కింవైకతా మాశ్రయే
యస్యేత్థం వివశో వికల్పలలితాకూతేన యోషిజ్జనః
కిం తద్యన్న కరోతి దేవి హృదయే యస్య త్వమావర్తసే. 6

మ॥ కనులం జుఱ్ఱుదునా, కవుంగిటను బిగ్గంజేతునా, బల్మిఁదా
ర్కొననా, యొక్కట నెత్తిపట్టుకొననా, కాంకేల, "నీయిష్టమే
మను భావంబున స్త్రీజనంబు వశమౌ; నాశ్చర్య మిందేమి? ని
న్ననిశంబుందలపోయు భక్తుని కసాధ్యంబున్నదే! పార్వతీ! 6

శ్లో. విశ్వవ్యాపిని యద్వదీశ్వర ఇతి స్థాణా వనన్యాశ్రయః
శబ్దశ్శక్తిరితి త్రిలోకజనని త్వయ్యేవ తథ్యస్థితిః
ఇత్థం సత్యపి శక్నువంతి యదిమాః క్షుద్రారుజో బాధితుం
తద్భక్తానపి నక్షిణోషి చ రుషా తద్దేవి చిత్రం మహత్. 7

ఉ॥ ఎల్లెడ నిండు స్థాణువునకే సరి యీశ్వరుఁడంట; నీకె సూ
చెల్లును శక్తి యన్న; నిది సిద్ధ మిటుండఁగ నీశ్రితాళికిన్
జిల్లర రోగము ల్వెతను నింపఁగఁగల్గుట, నీవు నల్కతో
డుల్లగఁజేయకుండుట కడుంగడు వింత, జగాల తల్లిరో. 7

శ్లో. ఇందో ర్మధ్యగతాం మృగాంకసదృశచ్ఛాయాం మనోహారిణీం
పాండూత్ఫుల్ల సరోరుహాసనగతాం స్నిగ్ధప్రదీపచ్ఛవిం
వర్షంతీ మమృతం భవాని భవతీం ధ్యాయంతి యే దేహినః
తే నిర్ముక్తరుజో భవంతి విపదః ప్రోజ్ఝంతి తా స్సారతః. 8

చ॥ చందురు నడ్మ నిల్చి, నెలచాయలతో విడుతెల్ల తమ్మిగ
ద్దెందిరముండి, నిద్దమగు దివ్వెకొడిం బురుడించుచున్ జవిన్
జిందుచు నందగించునటు నిన్నుఁదలంచెడి వాని చీడ లె
ల్లందొలఁగించుచున్ గొడవల న్విడఁగొట్టుదు వోభవాంగనా! 8

శ్లో. పూర్ణేందో శ్శకలైరివాతిబహుళైః పీయూషపూరైరివ
క్షీరాబ్ధేర్లహరీభరైరివ సుధాపంకస్య పిండైరివ
ప్రాలేయైరివ నిర్మితం తవ వపుర్ధ్యాయన్తి యే శ్రీద్ధయా
చిత్తాన్త ర్నిహితార్తితాపవిపద స్తే సంపదం బిభ్రతి. 9

చ॥ నెలనెలముక్కలం, జవులనింపుల, మంచునఁ, బాలవెల్లివా
గుల, నమృతంపుముద్దలను, గూరుప నైనదొ యన్నయట్లు నీ
నిలువును నడ్డమైఁదలఁచు నిర్మలులెల్లరు, నార్తితాపబా
ధలడఁగి సంపద ల్గలిగి తద్ద సుఖించుట యబ్రిమా? శివా! 9

శ్లో. యే సంస్మరంతి తరలాం సహసోల్లసంతీం
త్వాం గ్రంథిపంచకభిదం తరుణార్కశోణాం
రాగార్ణవే బహుల రాగిణి మజ్జయన్తీం
కృత్స్నం జగద్దధతి చేతసి తాన్ మృగాక్ష్యః. 10

చ॥ మినుకు మినుక్కుమంచొగిని మీదికి లేచుచు, గ్రంథిపంచకం
బును విడఁగొట్టిపోయి యెలప్రొద్దును బోలిన యెఱ్ఱరంగుతో
ఘనతరరాగవార్ధిని జగంబును ముంచెడిదానిఁగాఁగ నిన్
గను నరులన్ మృగాక్షులు మనంబునఁదాల్తురు శైవసుందరీ! 10

శ్లో. లాక్షారసస్నపిత పంకజ తంతు తన్వీం
అంతఃస్మరత్యనుదినం భవతీం భవాని
యస్తం స్మరప్రతిమ మప్రతిమస్వరూపాః
నేత్రోత్పలై ర్మృగదృశో భృశ మర్చయంతి. 11

ఉ॥ అమ్మరో! నిన్ను లక్కరసమందున ముంచిన తూఁటినూలి స
న్నమ్ముగ నెంచు పూరుషు ననారతమున్ సరిపోటులేని యం
దమ్ముల లేఁటికన్నెలలు దర్పకుఁగాఁగని కన్నుగల్వలన్
సమ్మతిఁబూజ సేయుదురన న్విసుమానమె? యోభవాంగనా! 11

శ్లో. స్తుమస్త్వాం వాచ మవ్యక్తాం
హిమకుందేందురోచిషమ్
కదంబమాలాం బిభ్రాణా
మాపాదతల లంబినీమ్. 12

గీ॥ మదికి సందని నిను నెల మల్లెమంచు
కన్నుగల వాణిగాఁగ, మీఁగాళ్ళ వ్రేలు
కడిమిపూదండ లొప్పు జగాల తల్లి
త్రిపురసుందరి గాఁగ నుతింతు మమ్మ! 12

శ్లో. మూర్ధ్నిందో స్సితపంకజాసనగతాం ప్రాలేయపాండుత్విషం
వర్షంతీ మమృతం సరోరుహభువో వక్త్రేపి రంధ్రేపి చ
అచ్ఛిన్నా చ మనోహరా చ లలితా చాతిప్రసన్నాపి చ
త్వామేవం స్మరతః స్మరారిదయితే వాక్సర్వతో వల్గతి. 13

చ॥ నెలతలఁదెల్లతామరను నిల్చుచు, మంచటు లచ్ఛనిగ్గుతో
బలువుగ బ్రహ్మరంధ్రమున వక్త్రమునందమృతంపుసోనలన్
జిలికెడి రీతి నిన్దలఁచు సిద్ధుని నోట స్మరారివల్లభా!
తలఁగక యింపుమీఱు లలితంబగు మెత్తని కైఁత లూరవే. 13

శ్లో. దదాతీష్టాన్ భోగాన్ క్షపయతి రిపూన్ హంతి విపదో
దహత్యాధీన్ వ్యాధీన్ శమయతి సుఖాని ప్రతనుతే
హఠాదంతర్దుఃఖం దళయతి పినష్టీష్టవిరహం
సకృద్ధ్యాతా దేవీ కిమివ నిరవద్యం న కురుతే. 14

చ॥ వలచిన భోగమిచ్చి, యరివారముఁగూలిచి, గండసంతతుల్
దొలఁచి. తెవుళ్ళ నాధులను దూల్చి, సుగంబులు నించి, దుఃఖముల్
బలిమి నడంచి, యిష్టమెడఁబాసిన గాసి నెడల్తువమ్మ! నీ
చలుపని దేది భక్తి నొకసారి నినుం దలపోయువానికిన్. 14

శ్లో. యస్త్వాం ధ్యాయతి వేత్తి విందతి జపత్యాలోకతే చింతయ
త్యన్వేతి ప్రతిపద్యతే కలయతి స్తౌత్యాశ్రయ త్యర్చతి
యశ్చ త్ర్యంబకవల్లభే తవగుణా నాకర్ణయత్యాదరాత్
తస్య శ్రీ ర్నగృహాదపైతి విజయ స్తస్యాగ్రతో ధావతి, 15

మ॥ నిను ధ్యానించుచు, నిన్నెఱుంగుచును, దా నీవంచు, వించున్ననున్
గనుచు, న్నిన్నె జపించుచున్, దలఁచుచున్, మన్నించివెన్నాడుచున్
నిను గీర్తించుచు నీగుణాళి వినుచున్ నిన్నిల్పి పూజించు వా
నిని శ్రీ వీడదు; సర్వకార్యజయమున్ సిద్ధించుఁగా శాంభవీ! 15

శ్లో. కిం కిం దుఃఖం దనుజదలిని క్షీయతే న స్మృతాయాం
కా కా కీర్తిః కులకమలిని ఖ్యాప్యతే న స్తుతాయాం
కా కా సిద్ధిఃసురవరనుతే ప్రాప్యతే నార్చితాయాం
కం కం యోగం త్వయి న చినుతే చిత్తమాలంబితాయామ్. 16

చ॥ దనుజవిమర్దినీ! నిను సతంబు స్మరించిన దుఃఖముండునే?
నినుఁగులపద్మినిన్ బొగడ నేర్చినఁగీర్తులు గల్గుటబ్రిమే?
నిను సురసన్నుతన్ గొలువ నిచ్చలు సిద్ధులు చెంతనుండవే?
మనసున నీకిడం గననమా? శివవల్లభ! యోగభాగ్యముల్. 16

శ్లో. యే దేవి దుర్ధరకృతాంత ముఖాంతరస్థాః
యే కాళి కాలఘనపాశ నితాంతబద్ధాః
యే చండి చండగురు కల్మషసింధుమగ్నాః
తాన్పాసి మోచయసి తారయసి స్మృతైవ. 17

గీ॥ కడఁగి విడిపింతు యమముఖగ్రస్తునైన;
వదలఁజేయుదు యమపాశబద్ధునైన;
ఉరుకలుషవార్ధిమగ్నుల నుద్ధరింతు;
స్మరణమాత్రాన శ్రీదేవి! చండి! కాళి! 17

శ్లో. లక్ష్మీవశీకరణచూర్ణసహోదరాణి
త్వత్పాదపంకజరజాంసి చిరం జయంతి
యాని ప్రణామమిళితాని నృణాం లలాటే
లుంపంతి దైవలిఖితాని దురక్షరాణి 18

గీ॥ నతులతోఁగూడి నొసఁటను నలువ చెడుగు
వ్రాతలనె మాపు నెది; శ్రీని వశము చేయు
చొక్కుపొడులకు నెది తోడిచూలొ; యట్టి
నీ యడుగుఁదమ్మిదూళికి నిత్యజయము. 18

శ్లో. రే మూఢాః కిమయం వృథైవ తపసా కాయః పరిక్లిశ్యతే
యజ్ఞైర్వా బహుదక్షిణైః కిమితి రే రిక్తీక్రియంతే గృహాః
భక్తిశ్చేదవినాశినీ భగవతీ పాదద్వయీ సేవ్యతాం
ఉన్నిద్రాంబురుహాతపత్రసుభగా లక్ష్మీః పురో ధావతి. 19

శా॥ మొద్దా! కాయముఁగష్టపెట్టకు తపంబుల్సేసి. జన్నంబులన్
దద్దెల్సేయకు మిల్లు గుల్లగు మహార్థమ్మోడి; దేవ్యంఘ్రిలన్
నిద్దాభక్తిని గొల్చికొమ్ము, సిరియే నీర్పుట్టువన్గాడుతో
నొద్దన్ముందునఁబర్వులెత్తు విను మాఁయూటాటలన్మానుమా. 19

శ్లో. యాచే న కంచన న కంచన వంచయామి
సేపే న కంచన నిరస్తసమస్తదైన్యః
శ్లక్ష్ణం వసే మధురమద్మి భజే వరస్త్రీః
దేవీ హృది స్ఫురతి మే కుల కామధేనుః. 20

గీ॥ దేవి నాపాలి కులకామధేనువుండ
నొరుల వేడను, వచింప. నొరుఁగొలువను.
కమ్మఁగాఁదిందు, కోరిన కొమ్మఁగూడి
కొందు, సుగముందు, నాకెందుఁగుందు లేదు. 20

శ్లో. నమామి యామినీనాథ లేఖాలంకృత కుంతలామ్
భవతీం భవసంతాప నిర్వాపణ సుధానదీమ్.

ఇతి

శ్రీ మహాకవి కాళిదాసకృత దేవీఘటస్తవః

గీ॥ త్రిపురసుందరి! రేయేని రేకతొడవు
గల నెరులదాన! యిదె నమస్కారమమ్మ!
పుట్టుసావుల వేండ్రిము మట్టుపెట్టు
చవివఅద! యిదె నా నమస్కారమమ్మ! 21

ఇది

మహాకవి శ్రీ కాళిదాసుని దేవీ ఘటస్తవమునకు
శ్రీ శ్రీయానంద నాథాపరనాముఁడు, ఈశ్వర సత్యనారాయణశర్మ
తెనుఁగుఁజేత.

---

( 4 )

# శ్రీ దేవ్యంబాస్తవము

—: o :—

శ్లో. యా మామనంతి మునయః ప్రకృతిం పురాణీం
విద్యేతి యాం శ్రుతిరహస్యవిదో వదంతి
తా మర్ధపల్లవిత శంకరరూపముద్రాం
దేవీ మనన్యశరణః శరణం ప్రపద్యే. 1

మ॥ జగదారంభక, యాదిశూన్యయని ప్రస్తావింతు రేమెన్మునుల్,
నిగమార్థజ్ఞులు జ్ఞానరూపయని యేనిత్యంబుశంసింతు, రా
భగవచ్ఛంకర వామదేహమగుచు న్భాసిల్లు నాతల్లి, న
న్యగతింగానని నేను నీవె శరణంబంచున్సదా కొల్చెదన్. 1

శ్లో. అంబ! స్తవేషు తవతావ దకర్తృకాణి
కుంఠీభవంతి వచసామపి గుమ్ఫనాని
డింభస్య మే స్తుతి రసా వసమంజసా పి
వాత్సల్యనిఘ్నహృదయాం భవతీం ధినోతు. 2

చ॥ భగవతి! నిన్నుతించు పనిపట్టిని వాక్కులు ప్రౌఢిసంపదం
దగినను వ్యర్థమై చనును, తల్లిరొ! నాపలుకట్టిప్రౌఢిమన్
దగనిద యైన, బిడ్డనుడి తల్లికిఁబోలెను వత్సలత్వసౌ
భగహృదయ న్నినుందనుపుపాటిది యెందుకుఁగాదు భారతీ! 2

శ్లో. వ్యోమేతి బిందురితి నాద ఇతీందులేఖా
రూపేతి వాగ్భవతనూరితి మాతృకేతి
నిస్యందమాన సుఖబోధ సుధాస్వరూపా
విద్యోతసే మనసి భాగ్యవతాం జనానాం. 3

చ॥ సరివదవబోధశర్మసుధ చక్కని రూపగు నీవు, పుణ్యభ
క్తవరులకేస్ఫురింతు కదె, తల్లి! నభంబుగ, నాదబిందురూ
పవుగను షోడశీకళగ, వాగ్భవదేహవుగాఁగ, మాతృకా
త్మవుగను, జకరిషట్కగతి ధ్యానము చేసెడి వేళ నంబికా! 3

శ్లో. అవిర్భవత్పులకసంతతిభిః శరీరైః
నిస్స్యందమానసలిలై ర్నయనైశ్చ నిత్యం
వాగ్భిశ్చ గద్గదపదాభి రుపాసతే యే
పాదౌ తవాంబ భువనేషు త ఏవ ధన్యాః. 4

గీ॥ గగురు మేనులతోడ, నీర్గాఱు కన్ను
జంటతోడుత, గద్గదస్వరముతోడ
నిత్యము న్నీపదముఁ గొల్చు నిర్మలాత్మ
తే కృతార్థులు జగముల; లోకమాత! 4

శ్లో. వక్త్రం యదుద్యత మభిష్టుతయే భవత్యాః
తుభ్యం నమో యదపి దేవి శిరః కరోతి
చేతశ్చ యత్త్వయి పరాయణ మంబ తాని
కస్యాపి కైరపి భవంతి తపోవిశేషైః. 5

గీ॥ త్రిపుర! నిన్గొని యాడ యత్నించు నోరు,
నీకు మ్రొక్కెడి శిరమును, నీకె యిడిన
మనసు, నెవనికొ, యేతపోమహిమమునొ.
వెలయు; నెల్లర కిలలోన వెలయవమ్మ! 5

శ్లో. మూలాలవాలకుహరా దుదితా భవాని
నిర్భిద్య షట్సరసిజాని తటిల్లతేవ
భూయోపి తత్ర విశసి ధ్రువమండలేందు
నిస్స్యందమాన పరమామృత తోయరూపా. 6

మ॥ ఇరవౌ మూలబిలంబునుండి శివరాణీ! లేచి షట్పద్మముల్
వరుస న్దాఁటియుఁ జంచలాలతిక తేపన్ వేయిపత్రిలదౌ
సరసీజంబునఁ జంద్రమండలగలత్సారామృతాకారవై
మరల న్నీకుహరంబుఁ జొత్తువు కదే మాయమ్మ! శ్రీసుందరీ! 6

శ్లో. దగ్ధం యదా మదనమేక మనేకధా తే
ముగ్ధః కటాక్షవిధి రంకురయాం చకార
ధత్తే తదా ప్రభృతి దేవి లలాటనేత్రం
సత్యం హ్రియైవ ముకుళీకృత మిందుమౌళేః. 7

గీ॥ కాలి పోయిన మదను నొక్కనినె నీదు
కల్కిక్రేగ న్ననేకులు గాఁగ మొలకఁ
జేసినది గోలె, నెలతాల్పు సిగ్గునఁ దన
నెన్నొసఁటి యగ్గికన్మూసికొన్నవాఁడు. 7

శ్లో. అజ్ఞాతసంభవ మనాకలితాన్వవాయం
భిక్షుం కపాలిన మవాసస మద్వితీయం
పూర్వం కరగ్రహణమంగళతో భవత్యాః
శంభుం శ ఏవ బుబుధే గిరిరాజకన్యే 8

గీ॥ పుట్టుగొలములు తెలియని పుట్టితాల్పుఁ,
దిరిపెకానిని, వేఱొక్క దిక్కులేని
యంగమొలవాని నీదు కల్యాణమునకు
మునుపెవఁ డెఱుంగును శంభుని? భూధర సుత! 8

శ్లో. చర్మాంబరంచ శవభస్మవిలేపనంచ
భిక్షాటనంచ నటనంచ పరేతభూమౌ
భేతాలసంహతి పరిగ్రహతాచ శంభోః
శోభాం బిభర్తి గిరిజే తవ సాహచర్యాత్. 9

ఆ॥వె॥ పీస్గుబుగ్గి పూఁత, బిచ్చయుఁ దోల్వల్వ,
కాటియాట, బూచిగముల లంకె,
యిన్ని యున్న నీదు నెనయికయే కదా
నీ మగనికి సొబగు నించు నగజ! 9

శ్లో. కల్పోపసంహరణకేళిషు పండితాని
చండాని ఖండపరశోరపి తాండవాని
ఆలోకనేన తవ కోమలితాని మాతః
లాస్యాత్మనా పరిణమంతి జగద్విభూత్యై. 10

గీ॥ అఖిల సంహారలీలా సమర్థములగు
ప్రళయహరు నుగ్రతాండవములు సయితము
నీదు చూపులఁజల్లనై నిఖిలరక్ష
కైన లాస్యమ్ముగా మాఱె నమ్మ! గిరిజ! 10

శ్లో. జంతోరపశ్చిమతనో స్సతి కర్మసామ్యే
నిశ్శేషపాపపటలచ్ఛిదురా నిమేషాత్
కల్యాణి దేశికకటాక్షసమాశ్రయేణ
కారుణ్యతో భవతి శాంభవవైధదీక్షా. 11

గీ॥ పాపపుణ్యసమత్వము వఱలి, ముందు
పుట్టువుల్లేని ప్రాణికే, పుట్టుకట్లు
ద్రుంచు భగవత్యుపాసన దొరకునమ్మ!
గురుకటాక్షముచేత నీ కరుణచేత. 11

శ్లో. ముక్తావిభూషణవతీ సవవిద్రుమాభా
యచ్చేతసి స్ఫురతి తారకితేవ సంధ్యా
ఏకస్సఏవ భువనత్రియసుందరీణాం
కందర్పతాం ప్రజతి పంచశరీం వినాపి. 12

గీ॥ క్రొంబగడపు లతను బోలు దంబు గలిగి
ముత్తెపునగల నొప్పు నిన్ జిత్తమందుఁ
జుక్కలంగూడు సందెగాఁ జూచువాఁడె
లేమలకుఁ బూవుటమ్ములు లేని మరుఁడు. 12

శ్లో. యే భావయంత్యమృతవాహిభి రంశుజాలైః
ఆప్యాయమాన భువనా మమృతేశ్వరీం త్వాం
తే లంఘయంతి నను మాత రలంఘనీయాం
బ్రహ్మాదిభిః సురవరైరపి కాలకక్షమ్. 13

గీ॥ అమృతముంజాలువార్చు కరముల. దేహ
తృప్తి యొనరించు నిను నమృతేశ్వరినిగఁ
దలఁచువార లజాదిత్రి దశవరులను
దాఁటలేని భవంబును దాఁటఁగలరు. 13

శ్లో. య స్స్ఫాటికాక్షగుణపుస్తకకుండికాఢ్యాం
వ్యాఖ్యాసముద్యతకరాం శరదిందుశుభ్రాం
పద్మాసనాంచ హృదయే భవతీ ముపాస్తే
మాత స్సవిశ్వకవితార్కిక చక్రవర్తీ. 14

గీ॥ తమ్మిపీఁట, శరచ్చంద్రధవళిమఁదగి
పాణులన్ గిండి, పొత్తము, స్ఫటికమాల,
జ్ఞానముద్ర, గలట్టి నిన్ సంస్మరించు
సన్నరుఁడె కవితార్కిక చక్రవర్తి. 14

శ్లో. బర్హావతంసయుత బర్బరకేశపాశాం
గుంజావళీకృత ఘనస్తనహారశోభాం
శ్యామాం ప్రవాళవదనాం సుకుమారహస్తాం
త్వామేవ నౌమి శబరీం శబరస్య జాయాం. 15

గీ॥ బిరుసు కొప్పున నెమ్మిలిపురియు. నిండు
గుబ్బల గురిజసరిసౌరుఁ గోముకేల్లఁ
బగడపుంజిగి నోరును వఱలు చామ
వన్నె వనదుర! నీకె నా వందనములు. 15

శ్లో. అర్థేన కిం నవలతాలలితేన ముగ్ధే
క్రీతం విభోః పరుషమర్థమిదం త్వయేతి
ఆళీజనస్య పరిహాసవచాంసి మన్యే
మందస్మితేన తవ దేవి జడీభవంతి. 16

గీ॥ గోల! కొ్రిందీవవలె నతికోమలమగు
సాము మేనిచ్చి, దురుసైన సామి మేను
గొఁటివే, దేవి! యని కేలిగొట్టు సకుల
యాటలడఁగెను నీమందహాసముననె. 16

శ్లో. బ్రహ్మాండబుద్బుద కదంబక సంకులో యం
మాయోదధి ర్వివిధతత్త్వతరంగ మాలః
ఆశ్చర్యమంబ ఝడితి ప్రళయం ప్రయాతి
త్వద్ధ్యానసంతతి మహాబడబాముఖాగ్నౌ. 17

గీ॥ అమ్మ! బ్రింహాండములె బుగ్గ, లఖిలతత్త్వ
ములె తరగలైన మాయాసముద్రి మిట్టె
నీ స్వరూపానుసంధాననియతి యనెడి
యమ్మహాబాడబాగ్నిలో నణఁగు; వింత! 17

శ్లో. దాక్షాయణీతి కుటిలేతి కుహారిణీతి
కాత్యాయనీతి కమలేతి కలావతీతి
ఏకా సతీ భగవతీ పరమార్థతోపి
సందృశ్యసే బహువిధా నను నర్తకీవ. 18

గీ॥ కమల, కుటిల, కుహారిణి, కత్యయనుని
బొట్టియ, కలావతియు, దక్షపుత్రి, యనఁగఁ
పలుగతుల నాఁటకత్తియవలెను బొల్తు;
తత్త్వమునఁజూడ నీవొకర్తవె; భగవతి! 18

శ్లో ఆనందలక్షణ మనాహతనామ్ని దేశే
నాదాత్మనా పరిణతం తవ రూప మీశే
ప్రత్యఙ్ముఖేన మనసా పరిచీయమానం
శంసంతి నేత్రసలిలైః పులకైశ్చ ధన్యాః 19

గీ॥ అమ్మ! సుఖమయమైన నీ యాకృతి నెద
నాదరూపమ్ముగాఁగ నంతర్ముఖాత్మ
ననుభవించిన ధన్యులు నిను నుతింతు్రి
మోదబాష్పాలతో గగుర్పాటుపుతోడ. 19

శ్లో. త్వం చంద్రికా శశిని తిగ్మరుచౌ రుచిస్త్వం
త్వం చేతనాసి పురుషే పవనే బలం త్వం
త్వం స్వాదుతాసి సలిలే శిఖిని త్వమూష్మా
నిస్సారమేవ నిఖిలం త్వదృతే యది స్యాత్. 20

గీ॥ నీవె, నెలజిగి, ప్రొద్దున నిగ్గు. నాత్మ
సత్త్రయున్, గాలి బలమును, జలముల రుచి,
యగ్గి వేడిమి, యౌదు; నీ వపసరిలిన
నఖిల మప్పుడె నిస్సారమగును; తల్లి! 20

శ్లో. జ్యోతీంషి యద్దివి చరంతి యదంతరిక్షం
సూతే పయాంసి యదహిర్ధరణీంచ ధత్తే
యద్వాతి వాయు రనలో యదుదర్చిరాస్తే
తత్సర్వమంబ తవ కేవల మాజ్ఞయైవ. 21

గీ॥ ఆకసంబున గ్రహచార, మంబరంబు
వాన కురియుట, శేషుని వసుధమోత,
గాలి వీచుట, యగ్ని యుజ్జ్వలి యగుట
యనెడి సర్వంబు నీదు చండాజ్ఞ; తల్లి! 21

శ్లో. సంకోచ మిచ్ఛసి యదా గిరిజే తదానీం
వాక్తర్కయోస్త్వమసి భూమి రనామరూపా
యద్వా వికాసముపయాసి యదా తదానీం
త్వన్నామరూపగణనాః సుకరా భవంతి. 22

గీ॥ మడగఁజూచెదవేని నామంబు రూపు
నడఁగి యూహకు మాటకు నందరావు,
రూపువడెదేని నీనామ రూపగణన
మాకు సులభంబు; గిరిసుతా! మంగళాంగి! 22

శ్లో. భోగాయ దేవి భవతీం కృతినః ప్రణమ్య
భ్రూకింకరీకృత సరోజగృహాః సహస్రాః
చింతామణి ప్రచయ కల్పిత కేళిశైలే
కల్పద్రుమోపవన ఏవ చిరం రమన్తే. 23

గీ॥ భోగములు గోరి నిను మొక్కు పుణ్యులు, తమ
బొమల సన్నల వేలు లచ్చిమలు కొలువ,
నీఁగిరామలలొప్పెడి యీఁగిచెట్ల
హౌసు పూఁదోఁటలోఁ దడువాడుకొంద్రు. 23

శ్లో. హర్తుం త్వమేవ భవసి త్వదధీన మీశే
సంసారతాపమఖిలం దయయా పశూనాం
వైకర్తనీ కిరణసంహతి రేవ శక్తా
ఘర్మం నిజం శమయితుం నిజమైవ వృష్ట్యా. 24

గీ॥ పాశబద్ధుల భవతాప మీశ! నీయ
ధీన; మదిదయతోనీవతీర్పఁదగుదు;
సూర్యసంతాపమడఁపఁగ సూర్యకిరణ
జనితవర్షంబె భగవతీ! శక్తము కద. 24

శ్లో. శక్తిః శరీర మధిదైవత మంతరాత్మా
జ్ఞానం క్రియా కరణమానసజాల మిచ్ఛా
ఐశ్వర్య మాయతన మావరణాని చ త్వం
కిం తన్నయద్భవసి దేవి శశాంకమౌళేః 25

చ॥ జననిరో! చంద్రశేఖరుని శక్తులు, మేను, పరస్వరూపమున్
స్వనిహితచేతనత్వమును. జ్ఞానము, నింద్రియముల్, మనం
బు, సునికి, చేష్ట, వృత్తియు. విభూతియునుంబరివారవర్గమీ
వనఁదగు; వానిదన్నిదదియుంతయు నీవ కదా, మహేశ్వరీ! 25

శ్లో. భూమా నివృత్తి రుదితా పయసి ప్రతిష్ఠా
విద్యానలే మరుతి శాంతి రతీతశాంతిః
వ్యోమ్నీతి యాఃకిల కలాః కలయంతి విశ్వం
తాసాం హి దూరతరమంబ పదం త్వదీయం. 26

చ॥ అవనిని గల్గు నిల్కడయు, నప్పుల గొప్పయు, నిప్పు తేజు, గం
ధవహుని శాంతియున్, హరిపదంబున మీఱెడి నిమ్మళమ్ము, న
న్నవి యఖిలంబుఁదాల్చు కళలైనను, బైఁబడి వానికెంతయో
దవుదవులందు నీదయిన త్రాణము పొల్చును, విశ్వకారిణీ! 26

శ్లో. యావత్పదం పదసరోజయుగం త్వదీయం
నాంగీకరోతి హృదయేషు జగచ్ఛరణ్యే
తావద్వికల్పజటిలాః కుటిలప్రకారాః
తర్కగ్రహాః సమయినాం ప్రలయం న యాంతి. 27

గీ॥ నీ యడుగుఁదమ్మిదుగ యెద నిల్వనంత
వఱకు నరమరచిక్కులు వక్రగతులు
నేచు నొఁగాదులనెడి పిశాచములకు
సమయవాద్దుల మదులందుఁజావు రాదు. 27

శ్లో. నిర్దేవయాన పిత్రుయాన విహార మేకే
కృత్వా మనః కరణమండలసార్వభౌమం
యానే నివేశ్య తవ కారణపంచకస్య
పర్వాణి పార్వతి నయంతి నిజాసనత్వమ్. 28

చ॥ నగసుత! ఇంద్రియాధిపమనస్సును దష్కరహావ్యకవ్యల
భ్యగతులు దేవయాన పితృయానములందు మెలంగనీక, చ
క్కఁగ నిలఁజేసి, నీదయిన కారణపంచకయానమందె, గ
ద్దెగ నిడి యుత్సవంబులను దీర్తురు కొందఱు పుణ్యులంబికా! 28

శ్లో. స్థూలాసు మూర్తిషు మహీప్రముఖాసు శంభోః
కస్యాశ్చ నాపి తవ వైభవ మంబ యస్యాః
పశ్యాగిరామపి న శక్యత ఏవ వక్తుం
సాపి స్తుతా కిల మయేతి తితిక్షితవ్యం. 29

గీ॥ ఏపె వైభవ మావిరాడ్రూపశివుని
యష్టమూర్తుల నొకదానికైన లేదొ
యట్టి నిన్మెచ్చ వాక్పతియైనఁజాలఁ
డేను బూనితి నది క్షమియింపఁదగును. 29

శ్లో. కాలాగ్నికోటిరుచిమంబ షడధ్వశుద్ధౌ
ఆప్లావనేషు భవతీ మమృతౌఘవృష్టిం
శ్యామాం ఘనస్తనతటాం సకలీకృతౌ చ
ధ్యాయంత ఏవ జగతాం గురవో భవంతి. 30

మ॥ నినుఁగాలానిలకోటిభాసురనుగా, నిత్యంబు షట్చక్రభే
దనమందున్, సుధ జల్లులాగునను మూర్ధాంభోజసేకంబునం
దున, ధ్యానమ్మున నిబ్బరంపు బెదకంతుల్గల్గు శ్యామాంగిగాఁ
గను యోగుల్ త్రిజగద్గురుత్వపదమింగన్నారు పో శాంభవీ! 30

శ్లో. విద్యాం పరాం కతిచిదంబర మంబ కేచిత్
ఆనందమేవ కతిచి త్కతిచిచ్చ మాయాం
త్వాం విశ్వమాహు రపరే వయ మామనామః
సాక్షాదపారకరుణాం గురుమూర్తిమేవ. 31

మ॥ నిను వాగీశ్వరిఁగాఁ జిదంబరముఁగా నిన్ శర్మరూపంబుగా
నిను మాయామయిఁగా విరాట్తనువుఁగా, నిక్కంబుగా నెవ్వరె
ట్లనినన్, నేనో యపారసత్కరుణలో నజ్ఞాననిర్మూలనం
బొనరింపం గురుమూర్తివై యెదురుగా నున్నట్లు భావించెదన్. 31

శ్లో. కువలయదళనీలం బర్బరస్నిగ్ధకేశం
పృథుతరకుచభారక్రాంతకాంతావలగ్నం
కిమిహ బహుభిరుక్తైస్త్వత్స్వరూపం పరం నః
సకలజనని మాతః సంతతం సన్నిధత్తాం. 32

మ॥ పలుమాటల్మఱియేల: విన్మ తుది సంప్రార్థ్యంబిదే నల్లక
ల్వల చామందగు వన్నె, నున్న బిరుసై బాగౌనెరుల్ గొప్ప చ
న్నుల పూటమునఁ గ్రుంగునెన్నడుమునున్ శోభిల్లు నీదైన శ్యా
మలరూపంబు సతంబు మాకనుల కిమ్మా! లోకమాతా! సతీ! 32

ఇతి
మహాకవి శ్రీ కాళిదాసకృత దేవ్యంబాస్తవః

ఇది
మహాకవి శ్రీకాళిదాసుని ''అంబాస్తవమునకు
శ్రీ శ్రియానందనాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ
తెనుఁగుఁజేఁత.

—:o:—

( 5 )

# శ్రీ సకల జననీస్తవము

—:o:—

శ్లో. అజ్ఞానంతో యాంతి క్షయ మవశ మన్యోన్యకలహైః
అమీ మాయాగ్రంథౌ తవ పరిలుఠన్తస్సమయినః
జగన్మాతర్జన్మజ్వరమయతమఃకౌముది వయం
నమస్తే కుర్వాణాః శరణముపయామో భగవతీమ్. 1

శా॥ మాయాగ్రంథిని జిక్కి విప్పుకొను సామర్థ్యంబు లేకజ్ఞులై
హేయాన్యోన్యవివాదులై సమయులే యేఁజెల్ల! కోల్పోదురో
తాయీ! పుట్టువుకాఁకమబ్బెడపు జ్యోత్స్నా! నీకివే జోతముల్
మాయన్మ్రంపకుమమ్మ! లోకములయమ్మా! దిక్కు నీవే చుమా. 1

శ్లో. వచస్తర్కాగమ్య స్వరసపరమానంద విభవ
ప్రబోధాకారాయ ద్యుతితులిత నీలోత్పలరుచే
శివస్యారాధ్యాయ స్తనభరవినమ్రాయ సతతం
నమస్తస్మై కస్మై చన భవతు ముగ్ధాయ మహసే. 2

చ॥ పలుకున కుహకందని యపారసుఖంబును జ్ఞానమన్న వే
నిలువయినట్టిదై. యసితనీరజసన్నిభమౌచుఁజన్నువ్రే
గలమఁగ వంగు నడుమ్రగలదై శివ పూజ్యమునైన యొక్క మం
జులతరమైన తేజునకు జోతలు నిత్యమొనర్తు భక్తితోన్. 2

శ్లో. అనాద్యన్తా భేదప్రణయరసికాపి ప్రణయినీ
శివస్యాసీర్యత్త్వం పరిణయవిధౌ దేవి గృహిణీ
సపత్నీ భూతానామపి యదుదభూ శ్శైలతనయా
తదేతత్సంసారప్రణయన మహానాటకసుఖమ్. 3

చ॥ తొలుతయు నంచునుంగనఁగఁదోఁచని దానవు గాన, భిన్నతం
దలఁగెడి వేడ్క గల్గియును స్థాణుసతీత్వము, లోకమాతవై
చెలఁగియు శైలజాత్వమును జెందుటయుంగన, సృష్టిపేరి యి
బ్బలితపునాటకంబు జరుపన్ మెలతెంచిన సంబ్రమే కదా. 3

శ్లో. ఋగ్వేదం త్వేకే తత్త్వం భగవతి సదన్యే విదు రసత్
పరే మాతః ప్రాహుస్తవ సదసదన్యే సుకవయః
పరే నైతత్సర్వం సమభిదధతే దేవి సుధియః
తదేతత్త్వన్మాయావిలసిత మశేషం నను శివే. 4

ఉ॥ అమ్మ! ప్రధానమంచొకరు, నాత్మవటంచును నొక్క, రీపరిపం
చమ్మని యొక్క, రల్ల సదసత్తులు రెండునటంచు నొక్క, రీ
యిమ్మనఁబల్క, వేఱొకరివేవియుఁగాదని యందు; రిట్టి భే
దమ్ములు చూడ నీవిలసితమ్ములు నీవగు మాయనే కదా. 4

శ్లో. లరద్గుంజాహారస్తనభర నమన్మధ్యలతికాం
ఉదంచద్ఘర్మాంభః కణగుణిత వక్త్రాంబుజరుచమ్
శివం పార్థత్రాణప్రవణ మృగయాకారగుణితం
శివా మన్వ్యాంతీం శబరీ మహమన్వేమి శబరీమ్. 5

చ॥ మగఁడొక సింగఁడై యెఱుకుమాదిరిఁగ్రిడిని బ్రోవనేగఁ దా
ను గురిజపేర్ల చన్బరువు నొక్కన వంగిన కౌనుదీవతో,
బుగిలెడి స్వేదబిందువులఁబొల్పగు నెమ్మొగతమ్మి నిగ్గుతోఁ
దగిన కిరాతియై యతని దౌలెడి యావనదుర్గఁగొల్చెదన్. 5

శ్లో. మిథఃకేశాకేశిప్రథననిధనా స్తర్కఘటనాః
బహుశ్రద్ధాభక్తిప్రణయవిషయాః శాస్త్రవిధయః
ప్రసీద ప్రత్యక్షీభవ గిరిసుతే దేహి శరణం
నిరాలంబం చేతః పరిలుఠతి పారిప్లవ మిదమ్. 6

చ॥ అగసుత! తర్కశాస్త్రములనౌ సిగపట్టులఁజావు; ధర్మశా
స్త్రగతుల నెంతొ భక్తియును శ్రద్ధయు లేక ఫలమ్ము లేదు; చి
త్తగతి స్వభావచంచలము; దానికి నూఁతయె లేదు; మ్రోల నా
కగపడుమా, ప్రసన్నవగుమా, శరణార్థిని నన్ను గావుమా. 6

శ్లో. శునాం వా వహ్నేర్వా ఖగపరిషదో వా యదశనం
కదా కేన క్వేతి క్వచిదపి న కశ్చిత్కలయతి
అముష్మిన్ విశ్వాసం విజహి హి మమాహ్నాయ వపుషి
ప్రపద్యేథాశ్చేతః సకలజననీమేవ శరణమ్. 7

ఉ॥ ఎక్కడొ, యెందుచేతనొ, యదెప్పుడొ, యెట్టులొ జాఱిపోయి, యే
కుక్కలకో, హుతాశనునకో, ఖగపాళికొ, విందుచేయు నీ
డొక్కను నమ్మయుండఁదెవఁడున్; మనసా! యిటువంటి మేనిపై
మక్కువ వీడుమా; సకలమాతనె దిక్కని కొల్వుమా వెసన్. 7

శ్లో. తటిల్కోటి జ్యోతిర్ద్యుతిదళిత షడ్గ్రంథిగహనం
ప్రవిష్టం స్వాధారం పునరపి సుధావృష్టి వపుషా
కిమప్యష్టత్రింశత్కిరణ సకలీభూత మనిశం
భజే ధామ శ్యామం కుచభరనతం బర్బరకచమ్. 8

చ॥ ఇరుతిగముళ్ళకోన విదళించి యసంఖ్యతటిద్రుచిప్రభన్,
మరల సుధాస్రుతుల్వేలయు మైఁగొని స్వాలయమైన యాజ్ఞలోఁ
జొరఁబడి, ముప్పదెన్మిదగు చొక్కపుఁగన్కలఁగ్రిమ్మ నొక్కబ
ర్బరకచఁజంటిబర్వునను వంగిన చామనతేజుఁగొల్చెదన్. 8

శ్లో. చతుష్పత్రాంతష్షడ్దళపుట భగాన్తస్త్రివలయ
స్ఫురద్విద్యుద్వహ్ని ద్యుమణి నియుతాభ ద్యుతిలతే
షడశ్రం భిత్వాదౌ దళదళమథ ద్వాదశదళం
త్రికాశ్రంచ ద్వ్యశ్రం గతవతి నమస్తే గిరిసుతే. 9

సీ॥ ఆధారపద్మంబునం దాలుకోణమ్ము
లమరు కర్ణికయందు నధివసించి,
ముచ్చుట్లఁబొల్చి మెర్మలు నగ్గి వేవెల్గు
లెన్నియో వెల్గెడి చెన్నుతోడ
వరలు నోవెల్గుతీవా! యాఱురేకులఁ
బొల్చు స్వాధిష్ఠానమును గతించి
మఱఁబదిరేకులమణిపూరముందాఁటి,
పదిరెండుదళముల పద్మమనెడి
యాయనాహతమ్ము, నటుపైని బదియాఱు
దళములదివిశుద్ధజలజ, మంత
నాజ్ఞపేరి దళయుగాంబుజమును మీఱి
యరుగు నీకు నతులు గిరితనూజ!. 9

శ్లో. కులం కేచిత్ప్రాహు ర్వపురకుల మన్యే తవ బుధాః
పరే తత్సంభేదం సమభిదధతే కౌల మపరే
చతుర్ణామప్యేషాముపరి కిమపి ప్రాహు రపరే
మహామాయే తత్త్వం తవ కథమమీ నిశ్చినుమహో. 10

చ॥ జననిరో! నీస్వరూపమును శక్తియటంచు శివుండటంచుఁద
ద్ఘనతరసంగమంబనుచుఁగౌలమటంచును గొందరంద్రు; కా
దని, మఱికొందఱ దాపయిదటంద్రు; మహత్తర మాయవైన నీ
యునికి నిజంబెఱుంగ నెటులోపుదు మజ్ఞులమైన మేముమా! 10

శ్లో. షడధ్వారణ్యానీం ప్రళయరవికోటి ప్రతిరుచా
రుచా భస్మీకృత్య స్వపదకమలప్రిహ్వాశిరసామ్
వితన్వానః శైవం కిమపి వపు రిందీవరరుచిః
కుచాభ్యామానమ్రస్తవ పురుషకారో విజయతే. 11

ఉ॥ అమ్మ! లయార్కకోటిరుచి కన్గలమౌ రుచితోడ నాలుమా
ర్గమ్ములకోనఁగాల్చి, పదకంజనతాళికి నెన్నరాని శై
వమ్మగు దేహమీయఁదగి, భాసురనీలసరోజదీప్తి దీ
ప్తమ్మయి చన్నుబర్వనను వ్రాలిన నీపరశక్తి మేటిలున్. 11

శ్లో. మనుష్యాస్తిర్యంచో మరుత ఇతి లోకత్రియమిదం
భవాంభోధౌ మగ్నం త్రిగుణలహరీకోటి లుఠితమ్
కటాక్షశ్చేదస్య క్వచన తవ మాతః కరుణయా
శరీరీ పద్యోయం వ్రజతి పరమానందతనుతామ్. 12

గీ॥ పుట్టుకడలిని మున్గి యిమ్మజ్జగమ్ము
త్రిగుణకల్లోలతతిఁబడి తేల లేదు;
నీకృపాదృష్టి నేఁడింత నెఱపుదేని
తడయకీజీవుఁడానందతనుత నొందు. 12

శ్లో. ప్రియంగు శ్యామాంగీ మరుణతరవాసః కిసలయామ్
సమున్మీలన్ముక్తాఫల బహుళనేపథ్య సుభగామ్
స్తనద్వంద్వస్ఫారస్తబకనమితాం కల్పలతికామ్
సకృద్ధ్యాయన్స్త్వాం దహతి శివచింతామణిపదమ్ 13

చ॥ సరసపుఁబ్రేంకణంబువలెఁ ణామన మేగల నిన్నెవందెదన్
బొరి నెఱచీరయే చివురు, ముత్తెపుసొమ్ముల విర్వియే ఫలాల్
గురుకుచయుగ్మమన్పువ్వులగుత్తుల వంగును నెంచి, వేల్పుతీ
వ రహిఁదలంప నొక్కపరి వానికి శైవపదంబు గల్గదే. 13

శ్లో. ప్రకాశానందాఖ్యా మవిదితచరీం మధ్యపదవీం
ప్రవిశ్యైతద్ద్వంద్వం రవిశశిసమాఖ్యం కబళయన్
ప్రపశ్యోర్ధ్వంనాదంలయదహనభస్మీకృతమలః
ప్రసాదాత్తే జంతుః శివ మకులమంఘ్రి ప్రవిశతిః. 14

చ॥ జనని! రవీందులుందెలియఁజాలని యాజ్ఞను జక్కఁ జొచ్చి యా
యినశశులుండు చోట్లు కబళించుచు బైఁదగు నాదభూమిఁదా
నెనయుచు నామరూపముల నేరిచి బూడిద చేసి, నామరూ
పనియతి లేని మంగళనివాసముఁ జొచ్చును దేహి నీకృపన్. 14

శ్లో. షడాధారావర్తై రపరిమిత మంత్రోర్మిపటలైః
లసన్ముద్రాఫేనై ర్బహువిధచల ద్దైవతఝషైః
క్రమస్రోతోభిస్త్వం వహసి పరనాదామృతనదీ
భవాని ప్రత్యగ్రా శివచిదమృతాబ్ధిప్రణయినీ. 15

శా॥ తల్లీ! చక్రములాఋసుళ్ళుఁబలు మంత్రాలే యలల్, ముద్రలే
మొల్లంబౌనుఋ, వెల్లవేల్పులె ఝషంబుల్, సన్నుతాచారముల్
వెల్లుగ్గా, శివచిత్సుధాంబునిధినే ప్రేమించు శ్రీచక్రనా
మోల్లోలామృత పూతశై వలినివై యొప్పారఁగాఁబాఋదే! 15

శ్లో. మహీ పాథో వహ్ని శ్వసన వియదాత్మేందురవిభిః
వపుర్భిర్గ్రస్తాంగై రపి తవ కియానంబ మహిమా
అమూన్యాలోక్యంతే భగవతి నకుత్రా ప్యణుతమాం
అసత్తాం ప్రాప్తాని త్వయి తు పరమవ్యోమ వపుషి. 16

గీ॥ అమ్మ! నీలోన నణఁగు సూక్ష్మాంశములగు
నష్టమూర్తులదౌ గొప్పయనఁగ నెంత?
పెన్పయలె మేనుఁగా నీవు వెలసి నపుడు
కడు నలకలివి యెటఁగనఁబడును? దేవి! 16

శ్లో. కలాం మాయాం ప్రజ్ఞాం సమయ మనుభూతిం సమరసం
గురుం పారంపర్యం వినయ మాపదేశం శివకథామ్
ప్రమాణం నిర్వాణం ప్రకృతి మభిభూతిం పరగుహామ్
విధిం విద్యా మాహుః సకలజననీమేవ మునయః. 17

సీ॥ సాదాఖ్యకళగఁబ్రజ్ఞగ మాయగాఁ
ప్రకాశవిమర్శసామరస్యమ్ముగాఁగ,
ఆచారముగఁదత్సుఖానుభూతిగఁ బరం
పరణొదవచ్చు సద్గురుఁడుగాఁగ
తదుపదేశమ్ముగాఁదద్బోధగా, శివ
జ్ఞానదోపనిషత్తుగాఁబ్రమాణ
ముగ, ముక్తిగఁబ్రధానముగ, నభిభూతిగాఁ
బరసంవరణముగా బ్రహ్మగాఁగ

గీ॥ బ్రహ్మవిద్యగ నిను మునుల్ ప్రస్తుతింతు
రనఁగ, నిను మించినది యించుకంత లేదు;
అఖిలమును నీస్వరూపంబ యనుట కాదె,
పూతకరుణాసమేత! శ్రీ లోకమాత! 17

శ్లో. ప్రలీనే శబ్దౌఘే తదను విరతే బిందువిభవే
తతస్తత్త్వే చాష్టధ్వనివపురుపాధీ న్యుపగతే
శ్రితే శాక్తే పర్వణ్యనుకలిత చిన్మాత్రగహనాం
స్వసంవిత్తిం యోగీ రసయతి శివాఖ్యాం పరతనుమ్. 18

చ॥ వరుసగ నాదబిందువిభవంబులడంగఁగ నష్టనాదభా
సురవపురాశ్రియంబగుచు శోభిలు తత్త్వము చేతికంది, ధీ
వరుఁడగు యోగి, శక్తికళఁబట్టి చిదేకమహాటవీగతిన్
జరుగుచుఁదా శివుండనను జ్ఞానముతోడ సుఖించుచుండుఁగా! 18

శ్లో. పరానందాకారాం నిరవధిశివైశ్వర్యవపుషం
నిరాకారాం జ్ఞానప్రకృతి మపరిచ్ఛిన్నకరుణామ్
సవిత్రీం లోకానాం నిరతిశయధామాస్పదపథామ్
భవో వా మోక్షోవా భవతు భవతీమేవ భజతామ్. 19

చ॥ జననమె యిమ్ము; మోక్షమె యొసంగుము; తత్పరశర్మదేహవున్
గనఁగఁ బ్రపంచరూపవును, జ్ఞాననిసర్గవు, రూపహీనవున్
వినతకృపానిధానమవు, విశ్వజనిత్రివి, ధామసీమవౌ
నినునెభజింప నిమ్ము నను; నీదగు చిత్తమె నాదు భాగ్యమౌ. 19

శ్లో. జగత్కాయే కృత్వా తదపి హృదయే తచ్చపురుషే
పుమాంసం బిందుస్థం తదపి వియదాఖ్యే చ గహనే
తదేతద్జ్ఞానాఖ్యే తదపి పరమానందగహనే
మహావ్యోమాకారే త్వదనుభవశీలో విజయతే. 20

మ॥ జననీ! మూలమునుండి సక్రమముగాఁ జక్రమ్ము లొండొంటిలో
ననువొప్పంగఁ దతాత్మతంగనెడియ ట్లభ్యాసియై, యాటటన్
ఘనవైహాయసరూపమైన పరమానందాత్మకాచ్ఛాటవిన్
నిను సేవించెడి వాఁడఖండసుఖియై నిత్యత్వముంజెందఁడే. 20

శ్లో. విధే వేద్యే విద్యే వివిధసమయే వేదగులికే
విచిత్రే విశ్వాద్యే వినయసులభే వేదజనని
శివజ్ఞే శూలస్థే శివపదవదాన్యే శివనిధే
శివే మాతర్మహ్యం త్వయి వితర భక్తిం నిరుపమామ్. 21

సీ॥ కాలరూపిణి! వేదజాలశిఖాజ్ఞేయ!
వేదసారంబవై వెలయుదాన!
వివిధసదాచార! విద్యాస్వరూపిణి!
చిత్రచిత్రకృతులు చేయుదాన!

వేదత్రయీమాత! వినయసుఖావాప్య!
విశ్వమూలంబవై వెలుఁగు దాన!
సర్వమంగళ! శివస్థానప్రదాయిని!
ప్రళయమందును జేటుపడని దాన!
గీ॥ శ్రీశివజ్ఞానకలితవై చెలఁగుదాన!
అఖిలమంగళఖనివౌచు నలరుదాన!
పాటిలేనట్టి నీ పదభక్తి దాన
భాగ్యమిది ప్రోవుమమ్మ! నీవాఁడఁగాన. 21

శ్లో. విధేర్ముండం హృత్వా యదకురుత పాత్రం కరతలే
హరిం శూలప్రోతం యదగమయదంసాభరణతామ్
అలంచక్రే కంఠం యదపి గరళేనాంబ గిరిశః
శివస్థాయాః శక్తే స్తదిదమఖిలం తే విలసితమ్. 22

ఉ॥ బమ్మసిరంబుఁ ద్రుంచి కరపాత్రముగాఁ గయికొంట, వెన్నునిన్
ముమ్మొనవాలునందొలిచి మూపునకు న్నగచేసికొంట, క్ష్వే
ళమ్మును గంఠభూషణములాగునఁ దాల్చుటయుం, గిరీశునం
దిమ్ముగనున్న శక్తివగు నీశ్వరి! నీదు విలాసమే కదా. 22

శ్లో. విరించాఖ్యా మాతః సృజసి హరిసంజ్ఞా త్వమవసి
త్రిలోకీం రుద్రాఖ్యా హరసి వివిధాసీశ్వరదశామ్
భవంతీ నాదాఖ్యా విహరసి చ పాశౌఘదళనీ
త్వమేవైకానేకా భవసి కృతభేదై ర్గిరిసుతే. 23

చ॥ జగదుదయావనాంతములు స్రష్టృరమాపతిరుద్రసంజ్ఞలం
దగ సవరించు నీశ్వరతఁ దాల్తువు; భక్తుల సర్వపాపముల్
తెగఁగను నాదరూపిణివి; దేవి! యొకర్తవె యయ్యుఁ గార్యభే
దగతులఁ బెక్కురూపులను దాల్చి రహింతువు, శైలరాట్సుతా! 23

శ్లో. మునీనాం చేతోభిః ప్రముదితకషాయైరపి మనా
గశక్యం సంస్ప్రష్టుం చకితచకితైరంబ సతతమ్
శ్రుతీనాం మూర్ధానః ప్రకృతికఠినాః కోమలతరే
కథంతే విందంతే పదకిసలయే పార్వతి పదమ్. 24

చ॥ ప్రమదము నంది, యెంతొ మధురమ్ములెయైనను గొంకు మౌనిచి
త్తములకె యందరానిదగు తావకధామము నెట్లుగా నిస
ర్గమునఁ గఠోరమౌ శ్రుతిశిరస్సులెఱుంగుట? పార్వతీ! కిసా
లమృదుపదా! నితాంతమృదులా! లలితా! కలితాపహారిణీ! 24

శ్లో. తటిద్వల్లీం నిత్యా మమృతసరితం పారరహితాం
మహోర్త్రీర్ణాం జ్యోత్స్నాం ప్రకృతి మగుణగ్రంథి గహనాం
గిరాం దూరాం విద్యా మవినతకుచాం విశ్వజననీం
అపర్యంతాం లక్ష్మీమభిదదతి సంతో భగవతీమ్. 25

చ॥ తొలఁగని మించుతీవ, దరితోపని వేలుపుఁగూటియేఱునున్
మలుకలు లేని వెన్నెల, గొనాలకుఁజిక్కనిదౌ ప్రధానమున్
బలుకులకున్దవౌ తెలివి, వ్రీలని చన్నుల లోకమాతయున్
బొలిమెరలేని కల్మి యని నొక్కి వచింతురు నిన్నె పండితుల్. 25

శ్లో. శరీరం క్షిత్యంభః ప్రభృతిరచితం కేవలమిదం
సుఖం దుఃఖం చాయం కలయతి పుమాంశ్చేతన ఇతి
స్ఫుటం జానానోపి ప్రభవతి న దేహీ రహయితుం
శరీరాహంకారం తవ సమయబాహ్యో గిరిసుతే. 26

చ॥ హిమగిరిపుత్త్రి! నీ సమయ మింతయెఱుంగని ప్రాణి, యీ శరీ
రము క్షితిముఖ్యభూతనికరంబుననైనది, దీనిచేనె, క
ష్టము సుఖమొందుచుండు నని స్పష్టమె యైనను, నేనటన్న దే
హమె యను భ్రాంతి వీడఁగ సమర్థుడు కాఁడది యేమిపాపమో. 26

శ్లో. పితా మాతా భ్రాతా సుహృదనుచర స్సద్మ గృహిణీ
వపుః క్షేత్రం మిత్రం ధనమపి యదా మాం విజహతి
తదా మే భిందానా సపది భయమోహాంధతమసం
మహాజ్యోత్స్నే మాతర్భవ కరుణయా సన్నిధికరీ. 27

చ॥ నెలవెలుఁగట్లు వెల్గు జననీ! తలిదండ్రులుఁ దోడఁబుట్టువుల్
చెలులును భృత్యులున్ గృహము క్షేత్రముఁగాయము సొమ్ము లెప్డునన్
వలపక వీడునో యపుడె పాయని మోహమయాంధకారముం
దొలఁచి కృపాపరాత్మవయి తోడయి యండనె యుండుమీశ్వరీ! 27

శ్లో. సుతా దక్షస్యాదౌ కిల సకలమాతస్త్వముదభూః
సదోషం తం హిత్వా తదను గిరిరాజస్య దుహితా
అనాద్యంతా శంభో రపృథగపి శక్తి ర్భగవతీ
వివాహాజ్జాయాసీ త్యహహ చరితం వేత్తి తవ కః. 28

చ॥ తొలి తుది లేక యా శివునితో విడియుండని శక్తివయ్యు, మున్
గలిగితి దక్షపుత్త్రివయి; క్రన్నన నాతని తప్పుచేతనే
యలిగి తలంగి యద్రిసుతవై శివుఁ బెండిలియాడినావెటుల్
తెలియుట నీకతల్? భగవతీ! జగతీజననయిత్రి! వింతయౌ! 28

శ్లో. కణాస్త్వద్దీప్తీనాం రవిశశికృశానుప్రభృతయః
పరం బ్రహ్మ క్షుద్రం తవ నియత మానందకణికా
శివాదిక్షిత్యంతం త్రివలయతనో స్సర్వముదరే
తవాస్తే భక్తస్య స్ఫురసి హృది చిత్రం భగవతి. 29

చ॥ భగవతి! నీద్యుతిన్ రవలె భాస్కరశశ్యనలాదులున్; పరం
బగు నలబ్రహ్మ మింతనలుసౌను భవత్సుఖమందు; ఈశివా
దిగ భువిదాఁక నిమ్ముకొను దేవిరొ! త్ర్యండశరీరవైన నీ
దగు నుదరంబునందయిన నాశ్రితులోఁగనవత్తు వింతయా! 29

శ్లో. పురః పశ్చా దంతర్బహి రపరిమేయం పరిమితం
పరం స్థూలం సూక్ష్మం సకులమకులం గుహ్యమగుహమ్
దవీయో నేదీయ స్సదసదితి విశ్వం భగవతీ
సదా పశ్యంత్యాఖ్యా వహసి భువనక్షోభజననీ. 30

మ॥ మునువెన్కల్, వెలిలోనులున్, గొలఁదియున్మెల్లంబు, దోలెమ్ములా
వును, గుంపున్విడి, దాపునుంబయలు, దవ్వంజేర్వయున్ మేలుఁగీ
డను నీవిశ్వము నీవె తాల్చెదవు పశ్యంత్యాఖ్య సార్థంబుగా
అనయమ్మున్ మఱి యీజగంబులను నల్లాడింతు వీవే కదా. 30

శ్లో. ప్రవిశ్య త్వన్మార్గం సహజదయయా దేశికదృశా
షడధ్వధ్వాంతౌఘ చ్ఛిదురగణనాతీతకరుణామ్
పరా మాత్రాకారాం సపది శివయంతీం శివతనుమ్
స్వమాత్మానం ధన్యా శ్చిరముపలభంతే భగవతీమ్. 31

చ॥ కరుణ నిసర్గమౌ గురుని కన్కలిచే సమయాధ్వగాములై
యిరుతిగదారిమబ్బు తొలఁగించు దయామయి, నాజ్ఞరూపయౌ
పర, నపుడే శివైక్యపరభావము నిచ్చెడి నిన్ను, ధన్యులే
చిరమును దారి తప్పక భజింపఁగఁగల్గుదురమ్మ! యీశ్వరీ! 31

శ్లో. మయూఖాః పూష్ణీవ జ్వలన ఇవ తద్దీప్తికణికాః
పయోధౌ కల్లోలాప్రతిహతమహిమ్నీవ పృషతః
ఉదేత్యోదేత్యాంబ త్వయి సహ నిజైః సాత్త్వికగుణైః
భజంతే తత్త్వౌఘాః ప్రశమమనుకల్పం పరవశాః. 32

చ॥ తరగల నడ్డులేని పెడిదంపుఁబయోనిధిఁదూర, లగ్గి, మి
ద్గురులును, బొద్దునందుఁగళుకుల్వలె నీమహదాది తత్త్వముల్
పొరిఁబొరిఁదారతంత్ర్యమునఁ బుట్టునణంగును సాత్త్వికాంశవి
స్ఫురణముతోడ నీయెడనె పో ప్రతికల్పమునందు నమ్మరో! 32

శ్లో. విధి ర్విష్ణు ర్బ్రహ్మ ప్రకృతి రణు రాత్మా దినకరః
స్వభావో జైనేంద్రః సుగతముని రాకాశమనిలః
శివః శక్తిశ్చేతి శ్రుతివిషయతాం తాముపగతాం
వికల్పై రేభిస్త్వా మభిదధతి సంతో భగవతీమ్. 33

చ॥ సమయము, విష్ణుఁడుం, బ్రకృతి, స్రష్ట, ణుజీవులు, సూర్యుఁ డగ్ని, య
భ్రము, జినదేవబుద్ధులు స్వభావము, శక్తి, శివుండు, నన్న భే
దముల నెసంగు నీవె శ్రుతితండమునందుఁబ్రసిద్ధవంచు, సో
ద్దెముగ విచక్షణుల్భగవతీ! నినునే బుధులుగ్గడింతు్రిగా. 33

శ్లో. శివస్త్వం శక్తిస్త్వం త్వమసి సమయా త్వం సమయినీ
త్వమాత్మా త్వం దీక్షా త్వమయమణిమాదిర్గుణగణః
అవిద్యా త్వం విద్యా త్వమసి నిఖిలం త్వం కిమపరం
పృథక్తత్త్వం త్వత్తో భగవతి న వీక్షామహ ఇమే. 34

చ॥ శివుఁడన నీవు; శక్తియనఁజెల్లుదు వీవ; అవిద్య వీవు; వి
ద్యవు; సమయాఖ్య వీవ; అది తాల్చినదానవు; ఆత్మ వీవు; దీ
క్షవు; నణిమాదులీవె; నినుఁగాదని వేఱొకఁడేది? సర్వమై
తివి; పరతత్త్వ మోభగవతీ! కనరాదిక మాకు వేఱుగా. 34

శ్లో. త్వయా యో జానీతే రచయతి భవత్యైవ సతతం
త్వయైవేచ్ఛత్యంబ త్వమసి నిఖిలా యస్య తనవః
గతా సామ్యం శంభో ర్వహతి పరమం వ్యోమ భవతే
తథాప్యర్ధంభూత్వా విహరతి శివస్యేతి కిమిదమ్. 35

ఉ॥ ఎవ్వడు నిన్నుఁగూడినపుడే యెఱుఁగున్; మఱి సృష్టి చేయు. నిం
కెవ్వని యిచ్ఛవీ; వెతని యెన్మిది మూర్తులు నీవు; గొప్పదౌ
నివ్వినురూపు నొందెదవౌ యెవ్వని సాటిగ; అట్టి దానవీ
వవ్వినువాఁకతాల్పుమెయి నద్దమన న్మరియాదయా? ఉమా! 35

శ్లో. అసంఖ్యైః ప్రాచీనైర్జనని జననైః కర్మవిలయాత్
కృతే జన్మన్యంతే గురువపుషమాసాద్య గిరిశమ్
అవాప్యాజ్ఞాం శైవీం క్రమతనురపి త్వాం విదితవాన్
నయేయం త్వత్పూజాస్తుతివిరచనైరేవ దివసాన్. 36

శా॥ అమ్మా! యెన్నియొ పుట్టులౌటను క్షయంబై కర్మ మింకిందు జ
న్మమ్మే లేక గురుస్వరూపశివులోనం జేరినన్ బాగె; శై
వమ్మౌ నాజ్ఞను మళ్ళి పుట్టుటయినన్ ద్వద్జ్ఞానమే కల్గి, ని
త్యమ్ము నీ పదపూజనస్తుతులచేతం బొ్రిద్దులంబుచ్చెదన్. 36

శ్లో. యత్తత్పత్రం కమలముదితం తస్య యా కర్ణికాఖ్యా
యోనిస్తస్యాః ప్రథితముదరే యత్ర దోంకారపీఠమ్
తస్మిన్నంతః కుచభరనతాం కుండలీతః ప్రవృత్తాం
శ్యామాకారాం సకలజననీం సంతతం భావయామి. 37

చ॥ ఇరుతిగరేకతామర జనించిన కర్ణికపేరి యోనిలో
బెరసినయట్టి యాప్రణవపీఠమునన్, గుచభారనమ్రయై
యురునుతి గాంచు కుండలినినుండి ప్రవర్తిలు శ్యామవర్ణ, ము
మ్మరమగు భక్తితో సకలమాతను నిన్నె తలంతు నిచ్చలున్. 37

శ్లో. భువి పయసి కృశానౌ మారుతే ఖే శశాంకే
సవితరి యజమానే వ్యష్టధా శక్తిరేకా
వహతి కుచభరాభ్యాం యావనమ్రాపి విశ్వం
సకలజనని సా త్వం పాహి మామిత్యవశ్యమ్, 38

చ॥ అరయఁగఁ బంచభూతములు, నర్క-శశాంకులు, యాజియన్న, యా
యిరుచపులందు నో.ర్తెయగు నేపరశక్తి. యురోజయుగ్మసం
భరనతయయ్యు, నీసకలభారము నూనునొ. యట్టి నీవు న
న్నరయుచుఁ గావుమమ్మ! సకలాంబ! యిదేయిదెనిచ్చలమ్మమా! 38

ఇతి
శ్రీమన్మహాకవి శాళిదాసకృత సకలజననీస్తవః

ఇది
మహాకవి శ్రీ కాళిదాసుని సకలజననీస్తవమునకు
శ్రీ శ్రియానందనాథాపరనాముడు, ఈశ్వర సత్యనారాయణశర్మ
తెనుఁగుఁజేఁత
శ్రీ పరదేవతార్పణమస్తు

సంపూర్ణం
శ్రీ రాజరాజేశ్వరీ చరణారవిందార్పణమస్తు

# పంచస్తవికిం జిన్న వివరణము.

## లఘుస్తవము.



1. ఐంక్లీంసౌః అనునవి ప్రథమ ద్వితీయ తృతీయపాదములలో వరుసగా ప్రథమ ద్వితీయ తృతీయాక్షరములు. ఇవియె సర్వమంత్రశాస్త్రమునకు పునాదిరాళ్లయిన బాలామంత్రి బీజములు. వానినిందు గుప్తముగా నుంచుటయ కాక ధ్యానవేళ లలాటమధ్యమమున ఇంద్రధనుష్ప్రభతోను శిరమునందు శుక్లపక్షచంద్రకాంతితోను హృదయమందు సూర్య ప్రభతోను దేవి దర్శనమిచ్చునని నిజానుభవమును దెలుపుచు, ఆ తేజస్సును పరాపశ్యంతీ మధ్యమావైఖరులనెడి వాక్కులునే త్రిపురసుందరిరూపమని యారంభించినాడు.

2. పైని జెప్పిన వానిలో మొదటిది వాగ్బీజము సర్వవిద్యాప్రదమువాగ్విలాసప్రదము. దానిని కుండలినీశక్తిగా నెంచి భజించునపుడు దోసలివమొక్క ఆధారతంతువువలె సన్ననైన దానిగా భావించి యదిసహస్రారమువఱకు వ్యాపించుచున్నటులు పాసింప వలయుననియు సూచించి అట్టిసాధకునకు మరల జన్మములేదను మహాఫలము నుద్ఘోషించినాడు.

3. ఆ వాగ్భవబీజమును బుద్ధిపూర్వకముగానో భయముననో వింతనో ఎట్లయినను, దాని యందలి బిందువును విడిచి ఐ ఐ యని యైనను జపించునపుడు జగన్మాత యనుగ్రహించి సకలవిద్యలను అమృతసూక్తులను ఇచ్చునంత మహిమను గలది యనుచున్నాడు. మనమహాకవి యీపద్యమును దేవీభాగవతమందలి సత్యవ్రతుడను మూగవాలుడు ఐకార జపముచే మహాకవియైన కథను మనసున నిడికొని వ్రాసినట్లు తోచును.

4. ఇందు ఓశాశ్వతీ! నీమంత్రస్వరూపమున రెండవదైన కామరాజబీజమును (క్లీం) కకారలకారములు తొలగించి మిగిలిన "ఈం" అనుదానికి ముందుగా 'ఓం' కారమును జేర్చి (నమస్కారాంతముచేసి) పండితుల పర్వములందు జపింతురు. అని అదియు వాఙ్మయమని ముచ్చటించినాడు. 'ఈం' గుప్తమహాసారస్వతబీజమని మంత్రశాస్త్ర ప్రసిద్ధము, ఇదే లక్ష్మీబీజము. ఇది దీర్ఘము కాకున్నను శక్తిబీజమే "అఇఉణ్" అను మాహేశ్వరప్రథమసూత్రవివరణమున అ = బ్రహ్మము, ఇ = శక్తినిగూఢినదై ఉణ్ = ప్రపంచరూపమయ్యెను. అని యున్నది. 'ఈం' కామకళాబీజమనియుశాస్త్రము. ఈ బీజమును రక్తవర్ణముగా భావించి యుపాసింపవలయును.

5. అమ్మా! నీమంత్రాక్షరములందు మూడవది సౌః (పరాబీజము) వర్ణనాతీతము. మోక్షప్రదము. దాని నాజ్ఞయందు చంద్రప్రభగలట్లుగాభావించి జపించు వారికి

సద్యోవాక్సిద్ధికరము. అది సకారమును (సరస్వతీబీజమును) గూడుటచే బుద్ధిజాడ్యమును దొలగించును అది విసర్గముతో గూడకున్నను సర్వసిద్ధిప్రదమని దాని మహిమము నుగ్గడించినాడు.

ఐం - క్లీం - సౌః, అనుదానికే శుద్ధవిద్యయనిపేరు.

6. ఇమ్మూడు బీజములను వేర్వేఱ యుపాసించువిధము దెలిపి, అమ్మా ! నీ మంత్రాక్షరములను క్రమముగా గాని క్రమము తప్పించిగాని హల్లులనుంచి ఐంక్లీంసౌః అనిగాని, వాని దొలగించి ఐం - క్లీం - సౌః అని గాని ఒక్కొకటిగాని కలిపిగాని జపించినను సర్వసిద్ధుల నిచ్చును. ఇంక శాస్త్రవిధిని జపించినచో చెప్పేదిదేమి యని వాని యసామాన్యమహిమమును దెల్పెను.

7. ఇందు సాకారోపాసనము చెప్పుచున్నాడు. తల్లీ! చక్కగా విదీన తామరరేకులను బోలు కన్నులును, కర్పూరము మొల్లలవంటి తెల్లని కాంతియుగలదానవుగాను, నీడాపలి యొకచేత పుస్తకమును రెండవదాన అభయముద్రయున్నట్లును, వెలుపలి యొకచేత అక్షమాలయు రెండవదాన వరదముద్రియు నున్నట్లును మనసున నిల్పి నిను ధ్యానించి పై మంత్రమును జపింపనివాడు కవియెట్లగునని నొక్కి చెప్పుచున్నాడు.

8. కవితాసిద్ధికై మఱియొక యుపాసనక్రమము. తల్లీ: మనోహరమైన తెల్లతామర కాంతితో గూడి, శిరస్సుపై నిలిచి అమృతమును జిలుకుచున్న దానిగా నిన్ను భావించి మంత్రజపము చేయువాని నోట నీవు ధారలపై గంగాతరంగములవలె ప్రవహింతువు కదా యని స్వానుభవము.

9. త్రిపురాదేవిని రక్తవర్ణగా ధ్యానించుట సకలజనవశీకరము "రక్తాంవశ్యే, స్వర్ణవర్ణాం స్తంభనే, మారణే (అ) సితాం ; ఉచ్చాటనేధూమ్రవర్ణాం, శాంతౌశ్వేతాం స్మరేదిమామ్" అని మంత్రరత్నాకరము. భూమ్యాకాశములు కుంకుమపరాగమున నిండినట్లు నీరక్త కాంతి గ్రమ్ముదలను భూమి లత్తుకనీటిలో మునిగినటులు ధ్యానించు వారలకు స్త్రీలెల్లరు వశలగుదురు.

10. ఇదియు స్త్రీమాదన ప్రయోగమే, బంగారు కుండలములు, భుజకీర్తులు, ఒడ్డాణము గలట్టుగా ఎఱ్ఱనిక్షకాంతిగల నిన్ను ధ్యానించి, యీ మంత్రాక్షరములకు "స్త్రీం" అను బీజమును చేర్చి జపించిన నీభక్తులను స్త్రీలెల్లరు నిలుకడలేని మనస్సుగలవారలైవచ్చి స్థిరముగా సేవింతురనుచున్నాడు.

11. శ్రీమాతృస్వరూపజ్ఞానమే కోరెడి భక్తులు, దేవిని జటాజూటమున చంద్రకళయు మంకెన పూవువంటి యెఱ్ఱచీరయు, బ్రహవిష్ణురుద్రేశ్వరసదాశివులనెడి పంచప్రేతలు ఆసనమును, పునుకల పేరును, ముమ్మొడుతల కసుపునుగలదానినిగా ధ్యానించి జపింపవలయునని ఉద్బోధించుచున్నాడు.

12. సామ్రాజ్యసిద్ధిని దేవివే యీయ వలెనని యనుచున్నాడు. జగదంబా! శ్రీవత్సుడనువాని పరివారమెంత? అతని సిరి యెంత? సామాన్యరాజవంశమున బుట్టిన వాడే యైనను నీపాదములు గొలిచి నీమంత్రమును జపించుటనే కదా, విద్యాధరుల (దేవయోనులు) చేతను పూజింపబడు సార్వభౌముడై ప్రతాపౌన్నత్యములతో వెలసెను అను తార్కాణము చూపెను.

13. శ్రీదేవ్యుపాసకుడే రాజయి పుట్టుననుచున్నాడు. జగజ్జననీ! ఈజన్మమున నిన్ను నిత్యమును శాస్త్రోక్తముగా మారేడు దళములతో పూజించువారలే ఆజన్మమున ఛత్రచామరవజ్రాంకుశాదిశుభరేఖలతో గూడిన కయిదామరలుగల భూపతులై పుట్టుదురు గాని యితరుల కట్టిభాగ్యమేల కలుగు ననునిశ్చయమును జెప్పెను.

14. బ్రాహ్మణుఌ పాలును, క్షత్రియులు నేతిని, వైశ్యులు తేనెను, శూద్రులు కల్లును పూజవేళ నివేదించి పరాశక్తిని తృప్తిపఱచినచో నిర్విఘ్నముగా నన్నికార్యములు సిద్ధించునని చాతుర్వర్ణ్యోచితద్రవ్యములను జెప్పినాడు.

15. "శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః" అనుమాటను బలపరచుచు అమ్మా! నీ నుండియే విష్ణువు ఇంద్రుఁడు మున్నగువారు పుట్టి కల్పావసానమున మరల నీలోనే లయమొందుచున్నారు. అట్టి మూలకారణమగు నీవే మనసునకందని మహిమ గలదానవును పరమేశ్వరివని నుతించుచున్నాడు.

16. త్రిసంజ్ఞకములయి జగమున వ్యవహరింపఁబడునవి యన్నియు నీస్వరూపమే యయి త్రిపురయను నామమును నీయందన్వయింప జేయుచున్నవి. అనగా త్రివర్గాత్మక ప్రపంచమంతయు నీవు గనుకనే నీకు త్రిపురయనిపేరు.

మూర్తులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు; అగ్నులు ఆహవనీయగార్హపత్య దక్షిణాగ్నులు; శక్తులు ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులు; జగములు స్వర్గమర్త్య పాతాళములు; మహా......మాటలు తత్, త్వమ్, అసి; తారబీజములు అకార, ఉకార, మకారములు; వేదములు ఋగ్యజుస్సామములు; స్వరములు ఉదాత్తానుదాత్తస్వరితములు; పవిత్రనదులు గంగాయమునాసరస్వతీ నదులు.

17. రాజసన్నిధిని లక్ష్మీదేవిని, యుద్ధమందు జయాదేవిని, మార్గమందు క్షేమంకరిని, అడవియందు శబరీదేవిని, భూతప్రేతపిశాచాదిభయమందు భైరవిని, మూర్ఛనలందు త్రిపురాంబను, జలప్రదేశమును దాటునపుడు తారాదేవిని స్మరించు వారికాపదలు రావని శాస్త్ర స్వానుభవములను జెప్పుచున్నాడు.

18. క్లీం:. సకలదేవతలు నీవే కాని నీకంటె వేరెవరును లేరు. అని కవి తాత్పర్యము.

19. అఆఇఈ మొదలుగాగల ప్రత్యేకవర్ణములచేతను, రెండేసి వర్ణముల చేరికచేతను మూడేసి వర్ణముల కూర్పుచేతను అటులే కమొదలు క్షవఱకును చేర్చి మార్చి పలుకుటచే

నీయే నామము లెన్నెన్ని యగుచున్నవో యవి యన్నియు నీనామములే వానికి నమస్కారము అనగా మాతృకావర్ణస్వరూపిణి - వాక్స్వరూపిణి శ్రీదేవియే యనుట.

20. దీని వివరణము నాతొలిపద్యమందే కలదు – మంత్రోద్ధారాదిక్రమముతోగూడిన యీ స్తోత్రము మిగుల ప్రశస్తమయినది. ఈ త్రిపురాస్తవమును నేననన్యమనస్కుడనై చేసితిని మీరును తద్గతమనస్కులరై పఠించి ఫలమొందుడనుచున్నాడు.

21. మహాకవి యయ్యును కాళిదాసుడు "వీనియందెన్నో లోపములున్నవి; లేవు అను విచారము నాకక్కరలేదు. నేనశక్తుడనైనను భక్తిప్రేరణమే యీరచనకు మూలము గాన అమ్మా ! నీభక్తులందఱు దీనిని పఠింతురని నానమ్మకము." అని తన వినయమును శ్రీదేవియందు భక్తిని ఈశ్లోకముచేదెలిపెను.

తనయందు లఘుత్వమారోపించికొని చేసినది కావునను దీనికి లఘుస్తుతి యను పేరు చెల్లును.

---

# చర్చాస్తవము.



1. నీకు మ్రొక్కువారికే చక్కదనము భాగ్యసంపద కవిత్వము అబ్బునని శ్రీదేవీభక్తి ఫలమునుమూందు సమదాయముగా జెప్పుచున్నాడు.

2. మహాకవి నైచ్యానుసంధానమును వినయమును భక్తిని చూపి సాధకుడహంకారదూరుడు కావలయు ననుచున్నాడు.

3. జన్మతీవ్రితాపము నడచునది తల్లీ! నీపాదభక్తియొక్కటే, అదే నానోట నీస్తుతిని జేయించుచున్నదని దేవీభక్తికే ప్రాముఖ్యమిచ్చుచున్నాడు.

4. భవసతీ ! తల్లీ! ఈజగములను పన్నుట కాచుట క్షయింపజేయుట, ఒకప్పుడు మాయ జ్ఞానము నెడపుట ఒకప్పుడెడపకుండుట మున్నగుపనులు నీలీలలు. కారణము లేదు.

5. గౌరమ్మా ! లేదామరవన్నెగలట్లు నిన్నెన్నువారిపై నీకటాక్షము పడుటచేతనే మదన బాణములకు జిక్కిన మదవతులు వారిని మోహింతురు.

6. లఘుస్తవమందలి 12 వ పద్యభావమే ఇంతును చర్చించినాడు.

7. దేవగణములలోనివారైన విద్యాధరులును మేరుపర్వతగుహలందు స్వేచ్ఛగా గూరుచుండి కల్పలతాంతములచే పూజించి తాము వీణలు వాయించుచు తమ యాండ్రచేత నీ స్తుతిగానము చేయింతురు. అనగా నీవు దేవపూజ్యవనుట.

8. జగదంబా! నీపాదములకు మ్రొక్కి ధన్యులైన భక్తులే కవులగుదురు. వారికే నిర్మలతమ యశస్సు గలుగును.

9. భక్తులయెడ నీకగు ప్రేమయే లక్ష్మిని లలనలను వశపెట్టు సిద్ధమంత్రము. అజ్ఞానమను చీకటిని మాపు పెండివ్వె.

10. అమ్మా! నీపాదములపై శిరములు మోపి దేవతాస్త్రీలే మ్రొక్కుదురు. అల్పులైన మర్త్యులమాట లెక్క?

11. సాధకునకు యోగవేళ తల్లీ! నీతేజస్సు శిరమున నెలవెలుగుగాను, ఆజ్ఞయందు ఇంద్ర ధనుర్వర్ణముగాను హృదయమున నిప్పుకణములవలెను గానవచ్చునని స్వానుభవము.

12. కవితాసిద్ధిగోరు భక్తుడు పరాశక్తిని చంద్రకాంతివంటి కాంతిగల సరస్వతిగా గాంచి యుపాసించినచో వాని నోట అమృతప్రవాహమువలె మృదుమధురవాక్కులు మేరలేక వెడలు చనుచున్నాడు.

13. ఆ కుండలినీ పరాశక్తి తేజము లక్క నీరువలె నేలయంతట గ్రమ్మినట్లును, కుం
14. కుమదుమారము గ్రమ్మినటులును క్షణ కాలము ఉపాసించువాడు స్త్రీలకు నవమన్మధుడే యగును. అని మాదనప్రయోగమును జెప్పినాడు.

15. "శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః" అను వీరశాక్తుడు గాన అమ్మా! నీవు ధరించిన చంద్రుడును, పురాణపురుషుడును, శివశరీరార్ధమును నీవే పరిమాత్మయని చెప్పక చెప్పుచున్నవి. (ఇందు నాలగవ పాదము తత్త్వమసి యను మహావాక్యము నర్థమును బోధించు చున్నది.) కవి చెప్పుచున్నాడు.

16. జగన్మాతవగు నీవు సత్త్వాదిగుణాశ్రయములో ఏ రూపును గొన్న జగద్గురుండగు శివుడు ఆ రూపమునే ధరించును. రజోగుణాశ్రయమున నీవు సరస్వతివైన అతడు బ్రహ్మ యగుచున్నాడు. సత్త్వగుణములో నీవు లక్ష్మివైన అతడు విష్ణువగుచున్నాడు. తమోగుణములో నీవు రుద్రాణివైన అతడు రుద్రుడగుచున్నాడు. అనగా ఈ రూపము లన్నియు నీవే యని, నీవే సృష్టిస్థితిలయకారిణివని నిర్ధారించుచున్నాడు.

17. చంద్ర కిరణ సమూహ కాంతివలె నిన్ను నిష్కలుష మనస్సులో ధ్యానించువాని కప్పుడే ప్రశస్తమైన, స్థిరమైన వాగ్విలాసము నిత్తువమ్మా! యని సారస్వతాప్తిధ్యానవిధిని జెప్పినాడు.

18. శాస్త్రోక్త ప్రాణాయామ సహితముగా కుండలినీ పరాశక్తిని లేపి సుషుమ్నా మార్గమున గొంపోయి యాజ్ఞయందు ఎఱ్ఱ తామర చాయగల దానిగా ధ్యానించువానికి లోకులెల్లరు అగపడుదురు.

19. క్రొత్త లక్కనీటి రంగున వెలయు నిన్ను బాల సూర్యబింబమున ధ్యానించుట స్త్రీవశీకరణ విధి యనుచున్నాను.

20. ఇది కవితాసిద్ధి ధ్యానము సుస్పష్టము.

21. అనఘాత్ములైన భక్తుల హృదయమును పీడక సర్వాపదలను బాపుదువు.

22. పుటముపెట్టిన బంగరు వన్నెగలదానవుగా నిన్ను ధ్యానించు నా పాపములు పోవనియు జన్మ బంధము వీడదనియు నాకు బెంగ లేదనుచున్నారు. ఇచ్చట జారత్వాది దోషములచే మహాకవి చెఱనుంపబడినట్లును దేవిని ధ్యానించి విడివడినట్లును కొందఱు చెప్పుట తప్పే యని నా యూహము.

23. నీవే యిన్ని పేళ్ళతో వరలుచున్నావు. తల్లీ! యనుచున్నాడు.

24. షడ్వికార రహిత బ్రహ్మ స్వరూపిణివైన నీవు భక్తుల కోర్కెలనుదీర్చి అజ్ఞానమును హరించి మోక్షమిత్తువు.

25. సదాశివుడను పీఠముపైనుండి శ్రీచక్రార్చ్యయగు త్రిపురసుందరి నిందు వర్ణించుచున్నాడు. గణపతి, భైరవుడు, రతి మన్మథులు ప్రక్కల గొల్చుచుండ, అనంగకుసుమ, అనంగమేఖల, అనంగమదన, అనంగమదనాతుర అను నల్వురు ప్రాగాది దిక్కులను, అనంగరేఖ - అనంగ వేగిని - అనంగమాలిని యను నల్వురును ఆగ్నేయాది విదిక్కులయందును ప్రాదక్షిణ్య క్రమమునను౦డి (ఈ యెనమండ్రు శక్తులుండు ఆవరణమే అష్టారము. దీనికే సర్వ సంక్షోభణ చక్రమందురు. ఇక్కడ పూజింపబడు త్రిపురసుందరికే గుప్తతరయోగిని యందురు) సేవింపగా త్రిసిద్ధులును (దివ్యౌఘ - మానుషౌఘ - సిద్ధౌఘ) అనువానిలో సిద్ధౌఘమునందు శ్రీజ్ఞానానందనాథ శ్రీసత్యానందనాథ శ్రీపూర్ణానందనాథులే త్రిసిద్ధులు.

చుట్టునుండగా కడిమితోటయందు వసించు త్రిపురసుందరి నన్నేలు గాక యని శ్రీచక్రార్చనవేళ నొకప్పుడు చేసిన ప్రార్థనము కావచ్చును.

26. ఇదియు శ్రీ మాదన ధ్యాన విధి.

27. జగన్మాతా! నీవు నాకిచ్చిన యవయవము లెప్పుడును నీ సేవకే యగునట్లు చేయు భారము నీదెసుమా యని నిరహంకారుడై వేడుచున్నాడు.

28. తల్లీ! నీ మంత్రిమండలి క్లీం బీజము కామదైవతము. దానిని వికసించిన దానిమ్మపూ రంగు దానిగా భావించుచు నీకంటె నది వేఱుకాదు నీ స్వరూపమే యని ధ్యానించువాడు కురూపి యైనను అందకత్తెలకు నవమన్మధుడుగా గానవచ్చునట. ఇది శ్రీ వశీకరణ ధ్యాన విధి.

29. సర్వ దేవతావంద్యవు సర్వాంతర్యామినివి, జగన్మాతవు, నీకు మ్రొక్కులు.

30. ఇందు చర్చాస్తవ పఠన శ్రవణ ఫలమును జెప్పినాడు.

——

# ఘటస్తవము

——

1. ఆనందభరితుడై యింద్రుడు దేని పూదండలలో పూజించెనో, ఏది మహిషాసురుని తల ద్రొక్కెనో, ఏది బంగరుటందె చప్పుడులచే రమ్యమైనదో అట్టి యంబికా పాదపద్మమే మాకు సర్వకార్యజయము నిచ్చుగాక యని తన యభీష్ట దేవతయైన మహా కాళి ప్రార్థనము నే చేయుచున్నాడు.

2. నానావతారములు దాల్చిన తల్లీ! సంసార తాపముచే కలగిన మము గాపాడుము. "అన్యథా శరణం నాస్తి' నమస్కారమని దేవి యైశ్వర్యము పొగ్గడించినాడు.

3. అమ్మా! నీ దాసునకు రాజులును దాసులౌదురు. దేవ సంఘమును వశమగును. నిను గొనియాడువాడే లోకులచే గొనియాడబడును. నిన్నారాధించు వానికే నారులు వశ పడుదురు. అని అంబాసేవ సర్వవశీకర మనుచున్నాడు.

4. ఉపాసనయందు సాధకుడు ఒడలు తెలియని తీవ్రత బొందవలయును. అట్టి వాని కెల్లరు వశులగుదురనుచున్నాడు.

5. త్రిపురసుందర్యుపాసకుడు అందము చెడిన ముదుసలియైనను అందకత్తెలు వానినే కోరుదురట.

6. నిను సదా సేవించువారికి జనవశీకరణము వింతకాదు. నీ యుపాసకుల కసాధ్యము లేదనుచున్నాడు.

7. ఓ తల్లీ! ఈశ్వరశబ్దము నీ భర్తయైన శివునకు శక్తి శబ్దము నీకును చెల్లుచుండగా నీ యాశ్రితులనంటిన వ్యాధు లెందుకు దుల్లవు. నీ కోప రహిత దృష్టియే సర్వ వ్యాధి హరమని - తానెపుడో వ్యాధి గ్రస్తుడైనపుడు చేసిన స్తోత్రముగా నున్నది.

8. కర్మ వశమున వ్యాధి గ్రిస్తుడైన భక్తుడు తెల్లని కాంతితో దివ్వె కాంతివలె రాణించు చున్నట్లు శ్రీ దేవిని చంద్రబింబము నడుమ తెల్ల తామరనుండి యమృతము చిందుచున్న దానివలె ధ్యానించిన సర్వవ్యాధిహరము సర్వాపన్నివారకమని స్వానుభూతిని జెప్పినాడు.

9. ఆర్తితాపహర సంపత్కర ధ్యానవిధి:— శ్రీ దేవి చంద్రఖండములతోను, అమృత పూరములతోను, మంచు గడ్డతోను, పాల సంద్రపుటలలతోను, జేయబడినదా యన్నంత ధావళ్యము గలట్లు ధ్యానింపవలయును.

10. ఓ కుంతలినీదేవీ! నీ స్థానమైన మూలమును వీడి మిన్కుమిన్కుమని మీదికి లేచి సుషుమ్నా మార్గమునుబట్టి పోవుచు స్వాధిష్ఠానాది గ్రంథులను దాటిపోయి లలాట మధ్య మందు నిరుపమానమగు నీ రక్త వర్ణముచే లోకములు ముంచునట్లు ధ్యానాభ్యాసము చేయువాడు సకలలోక మోహకుఁడగును. ఇందు "గ్రంథిపంచక భిదమ్" అను నపుడు (1) జీవేశ్వరులు వేఱనుట (2) దేహమే నేననుకొనుట (3) స్థూల సూక్ష్మకారణ శరీరములందు వర్తించువాడు తానొక్కడే యయ్యును వేఱనుకొనుట (4) కార్య కారణము లొకటి యనుకొనక వేఱనుకొనుట (5) కారణమైన బ్రహ్మముకంటె భిన్న మైన ప్రపంచము సత్యమనుకొనుట ఈ భ్రమములే యనెడి 5 గ్రంథులను విడ గొట్టి యనియు చెప్పవచ్చును.

11. కుంతలినీదేవి సుషుమ్నా సంచారము చేయునపుడు లత్తుక నీట ముంచిన తామరతూటి దారమంత సూక్ష్మగా పైకి లేచుచున్నటులు ధ్యానించుటయు సర్వవశీకరణవిధి యను చున్నాడు.

12. నీవే మంచువలె చంద్రుడువలె ధవళకాంతుల దొప్పు సరస్వతివి. నీవే కదంబ పుష్ప మాలాలంకృతవగు త్రిపురసుందరివి అని మతించుచున్నాడు.

13. కవిత్వాప్తిధ్యానము శివ పద్యమును జూడుడు.

14. నీ పాదభక్తి భోగకరి, ఆపద్ధరి, వ్యాధిహరి, సుఖకరి యని స్తుతించుచున్నాడు.

15. శాంభవీ! నీ ధ్యానము, నీ జ్ఞానము, నీ కీర్తనము, నీ గుణశ్రవణము శ్రీకరములు జయ ప్రదములని స్తుతించుచున్నాడు,

16. అమ్మా! నీ స్మరణము దుఃఖహరము. నీ స్తుతి యశస్కరము. నీ యర్చనము సర్వ సిద్ధిప్రదము. ఆత్మ సమర్పణము యోగభాగ్యప్రదము. అనగా శ్రీమాతను స్మరించి నుతించి యర్చించి యాత్మార్పణము చేయుదువేని ఇహపరముల సాధించినవాడవగుదు వని యుద్బోధించుచున్నాడు.

17. చండీ కాళీ నామముల బరగు శ్రీ దేవీ స్మరణము మృత్యుంజయము.

18. తల్లీ! నీ పాదధూళి, కర్మఫలరూపముగా మా నొసటను బ్రహ్మ వ్రాసిన వ్రాత లెంత చెడ్డ లైనను మంచివానిగా మార్చి లక్ష్మీకరములగును. అనగా శ్రీ మాతృ పాదసేవచే నెంతటి దరిద్రుఁడైనను లక్ష్మీవంతుడగును.

19. అజ్ఞానులారా! కాయక్లేశసాధ్యములేయైన కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు, ఇల్లు గుల్ల చేయు దక్షిణలు పెట్టవలగు యజ్ఞములు మానుకొని భగవద్భక్తియే యున్నచో భగవతి పాదములనే సేవింపుడు. రాజ్యలక్ష్మి మీయందు పర్వెత్తునని -క్లేశధనవ్యయములు లేని దేవ్యుపాసనమున నిహపరములను బొందుదని యుపోద్బోధించుచున్నాడు.

20. యథార్థ భక్తుని ధీరతాస్వాతంత్ర్యములెట్టివో ఈ పద్యమున గనుఁడు.

21. అమ్మా! జననమరణ సంతాపము దొలగింప అమృతనదివి. నీవే కనుక నీకే నమస్కరింతును. అనుటచే దేవియే శాశ్వతసచ్చిదానందదాయిని యని తెల్పినాడు.

---

# అంబాస్తవము

---

1. అనాదియైనది, జగదారంభకయని మునులును, వేదతత్త్వజ్ఞులు జీవోపాధి నివారకయైన జ్ఞానస్వరూపయనియు నేయమ్మను బ్రశంసింతురో యా శివవామాంగార్ధాకృతియైన స్వయంప్రకాశదేవియే నాకు దిక్కు. మఱి యితరము లేదని ప్రపన్నుడగుచున్నాడు.

2. తల్లీ! ఎంత వాచాప్రౌఢి గలవాడయినను నిను నుతింపనిచో ఆ శక్తి వ్యర్థము. నా వాక్కులు ప్రౌఢములు గాకున్నను బిడ్డలమాటలు తల్లినివలె భక్తవత్సలవగు నిన్ను దనుపక పోవు. అని యహంకారదూరుడై వినయమును జూపుచున్నాడు.

3. అమ్మా! చిదానందామృతమే నీ స్వరూపము. సద్గురూపదిష్టసమయమార్గమున భజించు భాగ్యవంతులు షడాధారచక్రానుసంధానమందు నిన్ను వ్యోమబిందు నాదకళా వాగ్భవ తనూ మాతృకారూపిణినిగా గాంతురు. సమయాచారము గురుకటాక్షమున గలుగు మహా వేధాఖ్యసంస్కారము. మహానవమినాడు మూలాధారమునుండి లేచిన కుండలినీదేవి మణిపూరమున ప్రత్యక్షయగు నపుడచ్చట నిలిపి పాద్యాది భూషణాంతమగు నుపచారములచే పూజించి, అనాహతమునకు గొంపోయి తాంబూలాంతముగా అర్చించి, విశుద్ధ చక్రమునకు గొంపోయి చంద్రకళారూపరత్నములతో పూజించి, సహస్రారమునకు గొంపోయి సదాశివునితో జేర్చి తటిపైచి మరల భగవతి మూలాధారకుండమందు ప్రవేశించువఱకు సమయము నిరీక్షించుట యనునదే సమయాచారము. (2) దహరాకాశావ

కాలమందు శ్రీ చక్రమును భావించి చేయు పూజతే సమయాచారమని యొక మతము. (3.) వశిష్ఠశుకసనకసనన్దన సనత్కుమారాఖ్య తంత్రి పంచకమునకు సమయమని పేరు. అందు జెప్పబడిన యుపాసన విధికే సమయాచారమందురు. (4) శివునితో సామ్యము నొందుట సమయము. సామ్యము అధిష్ఠాన, అనుష్ఠాన, అవస్థాననామ, రూప, ములందు శివునిలో బొందును గాన సమయాదేవి ఆమె పూజ సమయాచారము.

4. భక్తి ప్రాబల్యముచే మేనుపులకింప, ఆనందాశ్రిపు లొలుక, గద్గదస్వరము వెడల నీపాద ధ్యానము చేయువారలే ధన్యులని స్వానుభవముందెలుపుచున్నాడు.

5. తొల్లింటి తపోబలముగల ఒకానొక పుణ్యాత్మునకే నిన్నుతించుట, నీకు మ్రొక్కుట నీకే చిత్త సమర్పణను చేయుట యను భాగ్యమబ్బు ననుచున్నాడు.

6. శాక్త యోగి పద్మాసనగతుడై గుదాకుంచనముచేసి వాయువున కూర్ధ్వగతి గలిగించి కుంభకమందే మనసుగలవాడై యుండ. స్వాధిష్ఠానగతాగ్ని జ్వలించి మణిపూర మందలి తేమ నార్చును. అందుచేతను వాయ్వాగ్నుల అఘాతముచేతను మూడున్నర చుట్లలో కులకుండమను మూలాధార కుహరమున నిద్రించు సర్పాకారయగు కుండలినీ శక్తి మేల్కొని చప్పున లేచి సుషుమ్నా మార్గమున రుద్రి, విష్ణు, బ్రహ్మ. గ్రంథులను షట్కమలములనుదాటి సహస్రి దళకమలమున శివునితోగూడి మోదించును. అదియే పరావస్థ యందురు.

ఈ స్తుతినే సౌందర్యలహరి యందు శ్రీ శంకరులు "సుధాధారాసారైః" అను శ్లోకముతో చేసిరి.

అమ్మా! ఆ విధముగా సహస్రారమునుండి యమృతమయంబులైన నీ పాద నిర్ణేజన జలములతో నీ భక్తుని శరీరమును దడిపి నీ లావును నీవు చేరుదువు.

7. ఇందు కామదహనకథ సూచించి అందా కటాక్షము చేతనే ఆనంగుడై మనుటచేత రతికి వైధవ్యదోషము పట్టలేదనుట, దేవ్యుపాసనపరలైన స్త్రీలకు వైధవ్యము గలుగ దని యుత్ప్రేక్షించి చెప్పుచున్నారు.

8. నిర్గుణ, నిర్వికల్ప, నిరీహమైన శివ బ్రిహ్మమునకు మహామాయవైన నీ చేరికచేతనే నామరూప క్రియాదులేర్పడి శంకరుడని, చంద్రిశేఖరుడని, మృత్యుంజయుడని అందఱు కొనియాడుటయ్యెనని దేవీ మహిమను స్తుతించినాడు.

9. శివుని యవలక్షణములన్నియు నీ పరిగ్రహము చేతనే శోభించినవనుటచేత శ్రీ మాతృ భజనమున భక్తుని యవలక్షణములు మంగళములగునని భావము.

10. మహా ప్రిలయమున రుద్రుడు జగముల నుపసంహరింప భైరవ తాండవము చేయు చున్నను నీ చల్లని చూపుచేత తాండవోగ్రిత పోయి నిఖిల రక్షచేయు లాస్యముగా

మాఱును. అనగా నీవే జగద్రిక్షకివి. మగవాని నృత్యము తాండవము. మగువ నృత్యము లాస్యము.

11. శైవాగమోక్త భవదుపాసనమే జన్మరాహిత్య సాధనము. దానికి నీ దయయే సాధనము. అదిలేక గురుకటాక్షి మబ్బదు. అదిలేక శ్రీ విద్యా దీక్ష గలుగదు. అది కల్గినగాని బంధము వీడి నిత్యసుఖి కాజాలడు. అని నిశ్చయార్థము.

12. ఇందు కామినీ మోహనధ్యానవిధిని జెప్పినాడు.

13. నీవు శిరమునందు నిల్చి చేతులతో అమృతము జిల్కు చున్నట్లు ధ్యానించుట భవహరము ఇదే భవహరామృతేశ్వరీ ధ్యానవిధి.

14. లోక పూజ్యకవితాప్తికై పద్మాసనమందు శరత్కాల చంద్రకాంతితో దగి 4 చేతులందు క్రమముగా అమృతకలశము, పుస్తకము, స్ఫటికాక్షమాల, జ్ఞానముద్ర గలట్టుగా సాకార ధ్యానముంజేయవలయునని యనుభవము తెల్పినాడు.

15. ఇది వనదుర్గాధ్యానవిధి. గురిజసరిసౌరు = గురివిందపూసదండల యందము; గోము కేల్గ = సుకుమార హస్తములు;

16. అవతారమూర్తియైన పార్వతి చెలులు చనవున కేలి మాటలాడినను చిఱునవ్వుతోనే వారి ననుగ్రహించినది వారును దేవి పారమ్యము నెఱింగి తమ మౌఢ్యమునువీడి ధన్యులైరి.

17. అమ్మా! నీ స్వరూపానుసంధానము దక్క నీ మాయ నతిక్రమించు మార్గము లేదని నపుడు, నీ మాయయే యపార సముద్రము, ఈ జగములందు పెద్దలు బుగ్గలు, పంచ భూత తన్మాత్రాది తత్త్వములు అలలుగా రూపించుచు, తల్లీ! నిను నమ్మి కొల్చిన నీ మాయ నతిక్రమించుట యేమి వింత యనెను.

18. భావము సుస్పష్టము.

19. యోగానుసంధానపరులైన శివయోగులు అంతర్ముఖులై 12 దళముల సంవిత్కమల మందు ఆనందస్వరూపిణివై నాదపరిణామమునందిన నిన్నును తించినపుడు గగుర్పాటుతో మోదబాష్పములు విడువకుందురా? యని కవి స్వానుభవము.

20. సృష్టి యంపలి సర్వసారము నీవే తల్లీ! యని దేవి సర్వసత్తనుగ్గడించినాడు.

21. "భీషో స్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః" ఇత్యాది శ్రుతి వాక్య సారమిది.

22. అవ్యక్తవుగా నున్నపు డవాఙ్మానసగోచరవు. వ్యక్తవైనామ రూపములతో దర్శనమిచ్చి నపుదే నిన్నుతింప మాకు సుకరము, అన దేవియే కారణ కార్యరూప యనుట.

23. తల్లీ! కేవల భోగాసక్తులై యే నిను సేవించిన వారలను లక్ష్మి వేయి విధములుగా సేవించును. దేవలోకభోగము లనుభవింపగలరని నుతించెను.

24. పశుపులనబడు సకల జీవులును నీ మాయకధీనులై సంసార తాపము నందుచున్నారు అది యడంచుట నీ చేతిదే. సూర్య సంతాపము సూర్యుని వల్లనైన వాన చేతనే యడగ వలయునని, ముక్తి ప్రదవు నీవే యనుచున్నాడు.

25. నిర్గుణ నిత్యశుద్ధ బుద్ధ సచ్చిదానంద స్వరూప శివ బ్రహ్మముయొక్క త్రిశక్తులు, పరతర స్వరూపము, ప్రేరక చైతన్యము, సర్వైశ్వర్యములును మహా మాయవగు నీవే తల్లీ! యని దేవి పారమ్యమునే తెలిపినాడు,

26. జగదారంభకములైన పాంచ భౌతిక సంపదలకన్న నెంతో పైబడినది, నీ ప్రాభవమని యిందును దేవి పారమ్యమునే ఉగ్గడించినాడు,

27. అమ్మా! నీ చరణసేవానందము మనసున కందనంతకాలమును భేదవాదములు అనెడి పిశాచములు మతవాదులను బాధించుచునే యుండుననుచున్నాడు.

28. అమ్మా! హవ్యములచే దేవ మార్గమును, కవ్యములచే పితృమార్గమును బొంది పుణ్య లోకములలో దిరుగుట యనెడిది లేక శ్రీ రాజరాజేశ్వరివైన నిన్ను బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వర సదాశివులనెడి (పంచప్రేతలు) కారణ బ్రహ్మలే యాసనముగా గలదానవుగా, అనగా వారిని మీరిన పరాశక్తి వీవేయని నమ్మి ఇతరానపేక్షంబగు నీ యనుగ్రహముచే నుత్సవమొందువారు కొలదిమంది మాత్రమే. అని శ్రీ దేవీ పారమ్యమునుగ్గడించినాడు

29. ఇందును దేవి పరమైశ్వర్యమే ఉగ్గడించెను.

30. ఓ కుండలినీదేవీ! నిన్ను షట్చక్రములను దాటించునపుడు లయకాలానలారుణకాంతి గలదానవుగాను సహస్రారమును జేరి యమృతమును గురియించు దానవుగాను నెంచి, యిక సరూపాను సంధానమందు సకల జగత్పోషకంబగు స్తన్యమిచ్చు స్తనములుగల చామనమేని తల్లిగాను ధ్యానించు శివయోగులు జగత్పూజ్యు లగుదురనుచున్నాడు.

31. శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః యను శ్రుతినే బలపఱచుచున్నాడు.

32. తల్లీ! నీ స్వరూపము దురూహము, అనిర్వచనీయము. గాన నీ లీలామూర్త్యను సంధానమందే నాకుం బ్రేమ. నన్నదే కడతేర్చునది గాన నీ శ్యామలాంబా రూపమునే యిహపర సుఖదాయకమని మన్నించు నాకు దానినే సంతతము కనుల బెట్టుము, అని తుది ప్రార్థనము చేసినాడు. కావుననే కాళిదాసుడు.

——

# సకలజననీస్తవము

—☆—

1. దేవీ! భవతాపవినాశినీ! పండితులు సైతము నీమాయ నెరుగలేక పరస్పర కలహములకు లోబడి, దుఃఖసుఖములు కోరుచు తత్ఫలముగా జన్మపరంపరలబడి చెడుచున్నారు. నీవే దిక్కని నమ్మి నీకు మ్రొక్కు నన్నుమాత్రము నీ మాయలో ముంచక కాపాడుమా యని మ్రొక్కుచున్నాడు.

2. అవాఙ్మానసగోచరవు, సచ్చిదానందస్వరూపిణివి, నల్లకల్వవన్నెగలదానవు, జగత్పోషక స్తన్యభరస్తనభారముచే వంగిన నడుము గలదానవు, శివపూజ్యవు, మంజులతేజః స్వరూపిణివి, అయిన నీకు నమస్కారము.

3. జగదంబా! ఆద్యంతరహితవై శివునకభిన్నవయ్యును శివు భార్యవగుటయు, సకల జననివయ్యు కొండకూతురవై పుట్టుటయు చూడ నీభవనాటకము నాడించు నీవిలాసమే కదా.

5. శివుడు తనభక్తుడైన యర్జునునకు పాశుపతాస్త్ర మిచ్చి రక్షింప దలచి కిరాతవేషము దాల్చినపుడు తానును మగని బోయవేషమునకు దగు బోయతవేషమును దాలిచి చెమ్మటలు గ్రమ్మునటులు మగని వెంబడించిన నిన్ను (వనదుర్గను) సేవించెదను.

7. మహాకవి మానసబోధ నెపమున దేహముయొక్క క్షణభంగురత్వమును దెల్పి సకలజననీ పాదసేవయె అమృతత్వము (ముక్తి) నిచ్చునది యనెను.

8. శ్రీదేవి యోగమార్గారాధిత యగునపుడు గ్రంథులనాటిటిని పెక్కు మెఱుపులకాంతితో మీఱు ననియు ఆజ్ఞాసహస్రారములకుం బోవునపుడు అమృతము జిల్కు చంద్రికారూపము నొందుననియు అట్టి దేవీదర్శనము మహానుభావులకే యగునన్న యనుభవముం జెప్పెను. ఈ మాటయే సౌందర్యలహరి యందు శ్రీ శంకరగురువులచే "తటిల్లేఖాతన్వీం" అను శ్లోకమున చెప్ప బడినది.

9. కుండలినీ పరాశక్తి సుషుమ్నారోహణముం జెప్పి మ్రొక్కుచున్నాడు. పద్యము సుస్పష్టము.

11. ప్రళయసూర్యకాంతివంటి కాంతిగల్గు నిన్ను షట్చక్రములందు ధ్యానింపఁగల్గు వారలకే శాశ్వత శివపద మీయఁగలవు. ఆ యోపిక లేక నిన్ను నల్వకల్వలకాంతి గలదానవుగాను జగత్పోషణ సమర్థస్తనభారమున వంగిన దానవు గాను ధ్యానించినను అదే ఫలమను చున్నాడు.

12. నీకరుణయే అపార సంసారసాగరమునుండి దాటింప గలది. తల్లీ!

13. తల్లీ! ప్రేంకణపుచెట్టువలె శ్యామలాంగముగల నీవు కట్టిన యెఱచీఱయే చిగురు, నీ ముత్తెపుసొమ్ములే పండ్లు, నీ కుచములే పువుగుత్తులుగా రూపించి నిన్ను కల్పలతగా భావించి ధ్యానించు వారలకు శివసారూప్యము గల్గుననుచున్నాడు.

14. జగజ్జననీ! గ్రంథిషట్కమునుదాటి సూర్యచంద్రులకును దెలియరాని యాజ్ఞనుదొచ్చి సహస్రారమునందొచ్చి సర్వము లయము చేయుట యనెడి యగ్నిచేత నామరూపాదులను గాల్పగల జీవుడే నామరూపరహితమైన శివస్థానమునందు నివసించును. అది నీకరుణచేతనే కాదగును. ముముక్షువైన జీవుడు ఈవిధమైన యుపాసనమే చేయువలయునని కవి బోధము.

15. షట్చక్రములనెడి సుడులు, మంత్రములనెడి అలలు, శాంభవీ, ఖేచర్యాదిముద్రలనెడి నురుపు, నానావిధదేవతలనెడి మీనములు, ఆచారములనెడి ప్రవాహములు గల శ్రీచక్రమను అమృతనదిపైన నీవు చిత్స్వరూపశివుడనెడి అమృతవారిధిపైపే ప్రవహింతువు అనగా తల్లీ! శ్రీచక్రమందు నిన్నర్చించినవారికి శివైక్యమే ఫలమనుట.

16. ప్రకృతిలోని సూక్ష్మాంశములే శివుని యష్టమూర్తులు, మహామాయవు, లోకమాతవు. నీ మాయనణచి స్వస్థత నందినపుడు అవన్నియు నామరూపములు లేనివే, అనగా మహామహిమవతి భగవతియే యనుట.

17. సుస్పష్టము,

18. సర్వమును ఒకదానిలో నొకటి లయింపజేసి తత్త్వము చేరికందిన యోగి శక్తికళనే యాశ్రయించి శివానందము ననుభవించుచున్నాడు.

19. సుస్పష్టము.

20, 21, సుస్పష్టము వివరణ సహితము.

22. ఈశ్వరున కంతటి సామర్థ్యము నీమహిమవలననే యని స్తుతించుచున్నాడు.

23. త్రిమూర్త్యాదిసర్వము శక్తిస్వరూపమే యనుట.

24. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను శ్రుతివాక్యము చెల్ల బ్రహ్మవస్తువు నీవే సుమా యనుచున్నాడు.

25. సకలజననీ! నీవే నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావవు. నీ బిడ్డలైన లోకులెల్లరు త్రాగినను తరుగని స్తన్యముతోడి సడలని చనుదోయి గలదానవు అనగా సర్వజనని సర్వపోషిణి దేవియే యనుట.

26. దేవీ! సమయాచారవిధమున నిన్ను గొలువలేనివాడు దేహము పాంచభౌతికమనియు జీవునకిది పాపపుణ్యకర్మఫలరూపమైన ఉపాధియని యెఱిగి యుండియును నేననగా మేనే యను భ్రాంతిని విడువ లేడు. అని సమయదాహ్యులమైన మహాకవి జాలి పడుచున్నాడు.

27. భార్యాపుత్రాదులు తెచ్చి పెట్టునంత కాలమే గాని తరువాత తిరిగియైన జూడరు, దేహాదులందభిమానముంచి పోషించుచుకాని యవియును వెంటరావు. జీవుడుమాత్రము మోహాంధకారమున బడి దుఃఖపడుచుండును. నీ దయ గల్గిన వాడు భయమోహ రహితుడై ముక్తుడగును. అనియు జెప్పవచ్చును. లేదా, తల్లీ! భార్యపుత్రాదుల యందును గృహక్షేత్రాదులయందును మమకారము వీడి నిను సేవించువారినే నీవు కరుణింతువు. అనియు చెప్పవచ్చును.

28. ఆద్యంతములు లేక ఆశివునకనపాయినివైన శక్తివయ్యును, దక్షుని కూతురవగుట, ఆతని తప్పుచేతనే అలిగి తొలగి కొండదొడ్డైవె పుట్టి శివుని పెండ్లాడుట యను నీ వింతకవల తత్త్వము ఎవరికిని గోచరముకాదు.

29. లోకములకు వెలుగిచ్చు సూర్యచంద్రాదులకు వెలుగిచ్చుదానవు. నీ యానందలేశమే పరబ్రహ్మము. సకలలోకములు నీ కుక్షిలోనుండియు నీలోకములో ఏకదేశమైన నీ భక్తుని హృదయకమలమున నీవు ప్రకాశించుట మహాశ్చర్యము. అనగా శ్రీమాత భక్తప్రియ యనుట.

30. సకలజననీ! సర్వవిశ్వసృష్టిని నీవెటులు తాల్చుచున్నావో అటులే దీని నల్లాడించు శక్తిస్వరూపిణివి నీవె.

31. ధన్యజీవులంటే సద్గురూపదేశము, దానివలన సమయాచారతాత్పర్యము, దానివలన అజ్ఞాననాశమయి షట్చక్రభేదనశక్తి గలిగి యాజ్ఞాచక్రమందుండుట, దానివలన శివసాయుజ్యము అనెడి లాభములు. ఇదంతయు తల్లీ! నీకటాక్ష ప్రసారము నొందు ధన్యులకే, యనుచున్నాడు.

32. సూర్యునుండి కిరణములు. సంద్రమునుండి తుంపురులు. అగ్నినుండి మిణుగురులు పుట్టుచు అందే లయమగునట్లు జగదంబా! మహదహంకారాదితత్త్వములన్నియు పరాశక్తివైన నీయందే పుట్టి నీయందే లయించును. అనగా దేవియే ప్రపంచసృష్టి సంహారకారిణి యనుట.

33, 34. ఉపనిషద్వాచ్యవైన నీవే నానావిధనామరూపములతో నీప్రపంచస్వరూపిణివై యున్నావు. ఇదంతయు నీవిభూతి తల్లీ! యనుచున్నాడు.

35. మూలప్రకృతివైన నీవే పరమేశ్వరుని త్రివిధశక్తులుగా నున్నావు. ఆతని యష్టమూర్తులు నీస్వరూపమే, తుదినంతయు లయమగునపుడు మహావ్యోమాకృతి నాతనితో సాటిగా

నొందుచున్నావు. ఇదిట్లుండ శివునితో నీవు సగమనుట మరియాదకాదు. ఇచ్చట శివశక్తుల కభేదకల్పనము చూపినాడు. ఈ మాటలతోనే "శివఃశక్త్యా యుక్తో యది భవతి" యను ప్రథమ శ్లోకముతో శ్రీ శంకరాచార్యులవారు సౌందర్యలహరి రచన కుపక్రమించిరి.

36. సుస్పష్టము.

37. షట్పత్రికమలమండలి కర్ణికలో సుప్రసిద్ధమైన ఓంకారపీఠమునందుండి కుండలిని నుండియే నిరంతరప్రవృత్తి గలదియు శ్యామాకారయు జగత్పోషక స్తనభారముచే వంగినదియు నైన సకలజననినే సంతతము సేవింతునని తనకభిమతయగు శ్యామలాంబనే స్తుతించినాడు.

38. శివుని యష్టమూర్తులందు అష్టవిధములుగా ఏ యొక్క శక్తియే ప్రకాశించుచున్నదో, తాను చన్బరువుచే క్రుంగిపోవుచున్నను తన రూపమైన విశ్వము నే శక్తి మోయుచున్నదో ఆ సకలజననియే నన్ను రక్షించుగాత మని ప్రార్థించుచున్నాడు.

# శుద్ధి పత్రిక.

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1. | 3 | హస్థితామ్ | హఃస్థితా |
| | 4 | చింద్యా | ఛింద్యా |
| | 5 | ధనస్సు | ధనుస్సు |
| 2. | 1 | దృషాట్వ | దృష్ట్వా |
| | 5 | దెవ్వదేని | దెవ్వఁదేని |
| | 10 | ధన్వే | ధర్వే |
| | 16 | దాంతనా | దారనా |
| | 17 | పవిపత్తి | ప్రవృత్తి |
| 3. | 5 | దోజ్వలాం | దోర్జ్వలాం |
| | 9 | వీవల | లీవల |
| | 14 | లీమృత | లీమమృత |
| | 24 | త్రకురంగ | త్రస్తకురంగ |
| 4. | 4 | త్తైర్యం | స్థైర్యం |
| | 9 | స్వబం | స్విబం |
| | 19 | ద్వావర | ద్యాధర |
| | 25 | శోబిల్వీద | బిల్వీదశో |
| 5. | 25 | నగ్నులన్ | నగ్నులున్ |
| 6. | 24 | భైరవ | భైరవ |
| | 25 | వ్రతతి | ప్రతతి |
| | 30 | త్వనన్య | త్యనన్య |
| | 32 | ద్వార | ద్వార |
| 10. | 7 | ఒక్కొక్క | ఒక్కొక |
| | 17 | వృతీ | వృత్వీ |
| 11. | 17 | దేప్ | దేవి |
| 12. | 3 | నిర్ధరస్య | నిర్ఘరస్య |
| | 11 | వశ్యలి | పశ్యలి |
| 14. | 26 | కమిలేలి | కమలేలి |
| 15. | 28 | వ్యసవితా | వ్యసనితా |
| 18. | 9 | కషణ | షణ |
| | 28 | తద్భుక్తా | త్వద్భుక్తా |

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 20. | 18 | వ్యాధీస్ | వ్యాధీన్ |
| 22. | 6 | వచింప | వంచింప |
| 25. | 8 | దెఱుంగును | దెఱుంగు |
| 26. | 20 | చార్కిక చక్రివర్తీ | తార్కిక చక్రివర్తి |
| 27. | 8 | హసము | హాసము |
| | 13 | బ్రంహాంద | బ్రహ్మాండ |
| | 20 | దృస్య సే | దృశ్య సే |
| 28. | 4 | స్వాత్ | స్యాత్ |
| | 22 | యూహకుమాటకు నందరావు | యూహమునకు మాటకందరావు |
| 29. | 13 | రూవమున్ | రూపమున్ |
| | 27 | కల్ప | కల్ప |
| 30. | 21 | లానిల | లానల |
| 31. | 7 | పూటమున | పూటమ్మున |
| 36. | 26 | కబళయస్ | కబళయన్ |
| | 28 | ప్రివిశతిః | ప్రివిశతి |
| 37. | 1 | షడాధార | షడాధారా |
| 38. | 1 | తచను | తదను |
| | 15 | జనిత్రవి | జనిత్రివి |
| 41. | 22 | రూపయా | రూపయా |
| | 32 | నీయడనె | నీయెడనె |
| 43. | 1 | యత్షత్పత్రిం | యత్షట్పత్రిం |

## ★ శ్రీ శర్మద కస్తూరి మాత్రలు ★

### చంటిబిడ్డలకు అమృత గుళికలే

ఇవి చేతనుంచుకొన్న యెడల మీ బిడ్డలకు 3 ఏండ్లు దాటువరకు వైద్యుని అపేక్ష సాధ్యమైనంతవరకు లేకుండును. మీరే నిర్భయముగా అనుపాన వివరములు గల కాగితము సాయముతో వాడుకొనవచ్చును.

కస్తూరి, గోరోచనము, కుంకుమపువ్వు, జుండు, పావుదారు, గౌయిపిత్తము గాక 24 ఓషధులు చేర్చి తయారుచేసి 40 ఏండ్లనుండి లోకమున కిచ్చుచున్నాము.

అనుపాన వివరములు గల కాగితము మాత్రల పేకెట్టుతో సప్లయి చేయుదుము.

---

## బాలసుధ

మీబిడ్డలకు ఎండుతనము పోగొట్టి దబ్బ పండ్లవలె చేసి సంతోషించుటకు ఇది రెండుసీసాలు వాడి చూడండి. పాలఉబ్బసలు తొలగును. నడవలేని బిడ్డలకు మూలుగులలో బలము గలిగించును. బుద్ధిని బలపఱచును. విరేచనము మందత పోగొట్టును. దీనిని గుఱించి అధికము వ్రాయము. ఉపయోగించి కాడ్లివరు ఆయిల్ మొదలగునవి వాడుచున్న బిడ్డలతో మీ బిడ్డలను పోల్చిచూడండి.

శ్రీ శర్మద వైద్యశాల
శ్రీకాకుళం

వైద్యశాస్త్రి: ఈశ్వర సత్యనారాయణ శర్మ & సన్
వైద్యవిద్వాన్ ఈ॥ వెం॥ సూర్యనారాయణ శర్మ
రెజిస్టర్డు మెడికల్ ప్రాక్టిషనర్సు.

ఉత్తరాంధ్ర ప్రింటర్సు, శ్రీకాకుళం. 500—30-9-51